శ్రీ

# సతీ అనసూయ

(ఆఱంకముల నాటకము)

గ్రంథకర్త.

శ్రీయుత సోమరాజు రామానుజరావుగారిచే రచియింపఁబడినది.



ప్రకాశకుఁడు.

కురుకూరి సుబ్బారావు.

సరస్వతీ బుక్కుడిపో,

భీమడోలు అండ్ బెజవాడ.



నాల్గవకూర్పు 1000 ప్రతులు.

భారతీ ముద్రాక్షరశాల యందు ముద్రింపఁబడియె,

తెనాలి.

1929.

All Rights Reserved] [వెల రు 1-0-0

.100-

TPLH 01 B139

# పీఠిక.

## మొదటి కూర్పు.

నా "స్వరాజ్యరథము" ముద్రింపఁబడిన తరువాత కొంచెమించుమించుగ తిరిగి మద్విరచిత గ్రంథ మిదియే ముద్రింపఁబడుట—నేనాంధ్రదేశమును వదలి యీ బ్రహ్మదేశమునకు వచ్చుటయే యందులకుఁ గారణము. రమారమి మూఁడుసంవత్సరములనుండి నేను—"రంగూన్ శ్రీఆంధ్రజాతీయ నాటకసభ" యందు పనిచేయుచుంటిని. అప్పటినుండి యిప్పటివఱకు నేనీనాటకసభకొఱకై—౧౨ నాటకములను రచించి, ప్రదర్శింపఁజేసితిని. అందు—మొదటిది "ప్రహ్లాద" రెండవది—'సతీఅనసూయ.' 1922 వ సంవత్సరమున రంగూన్ ఎలిఫిన్‌స్టన్ బయస్కోపునందీ కథ కోహినూరు కంపెనీవారిచే ప్రదర్శింపఁబడినది. సరిగా నందెట్లు చూపఁబడినదో యటులే నేను దీనిని నాటకముగ వ్రాసితిని. బెజవాడ శ్రీమైలవరం బాలభారతీసభవారి హార్మోనియస్టు శ్రీయుత అలుగులపాటి రామానుజులుగారప్పుడీ సభయందుండిరి. ఈ నాటకమున కనుబంధముగా ముద్రింపఁబడిన పాటలకు వీరు స్వరముల నిచ్చి విశేషశ్రమ వహించి నాటకమునకు వన్నెఁ దెచ్చిరి. వీరికి నేను కృతజ్ఞుఁడను. ఈనాటకము ప్రథమమున రంగూను లూయివీధి సునేరాంహాలులో ప్రదర్శింపఁబడినాఁడు. భూమ్యాకాశములకొకటే వర్షధార! జనులిండ్లనుండి బయటకు రావీలులేదు. అట్టిస్థితిలో సభవారివసూలు సుమారు 1500 రూపాయలు. హాలులో నిసుక వేయుట కెడములేదు. నాటకసభాధికారులగు శ్రీయుత వెలగల వెంకటరెడ్డిగారీ నాటకమునందు చూపినయాదర మసమానము—విశేషధనవ్యయమొనర్చి ఆకాశమున గంగాజలము, నారదు డాకాశమున వీణ వాయించుట, గంగాజలము భూమినుండి పుట్టుట, కాలసర్పము పూలమాలయగుట, మన్మథవన మైదువిధములుగా మారుట, త్రిమూర్తులు పిల్లలగుట, అనసూయ విగతవస్త్రయై పాలిచ్చుట మొదలగు ప్రదేశములందు ధనవ్యయమునకు వెనుదీయక, గొప్ప ట్రాన్సఫరుసీనులు చేయించిరి—

బయస్కోపునందు గులకరాళ్ళు సెనగలుగా వేయింపఁబడుట చూపఁబడలేదు. అది మనపురాణములం దనుశ్రుతముగా వచ్చుచున్న కథగావున ముద్రించునప్పుడు నేనారంగమును సైతము చేర్చితిని, ఇంతకుముందిచ్చట మాకు ముద్రణాసౌకర్యములు లేనందున నానాటకము లన్నియు నముద్రితములై యుండెను. ఇప్పుడు నాటకములన్నియు వరుసగా ముద్రింపఁదలచియున్నాము.

విధేయుఁడు,
సోమరాజు రామానుజరావు, గ్రంథకర్త.

# ఈ నాటకనందు వచ్చు పాత్రలు.

## పురుషులు.

1 అత్రిముని-కథానాయికపతి
2 మన్మథుఁడు-కామదేవుఁడు
3 శ్రీమహావిష్ణువు } త్రిమూర్తులు
4 శంకరుఁడు } త్రిమూర్తులు
5 బ్రహ్మ } త్రిమూర్తులు
6 భృంగి-శివానుచరుఁడు
7 నారదుఁడు-దేవముని-కథాసూత్రధారి
8 కౌశికుఁడు-కుష్ఠురోగియగునొక విప్రుఁడు
9 పాపములు-గంగనుచుట్టుకొనునవి
10 ఇంద్రాగ్ని యమ వరుణులు-దేవతులు
11 మాలపిల్లలు
12 భూతము
13 దత్తాత్రేయుఁడు-బ్రహ్మవిష్ణుమహేశ్వరాంశము

## స్త్రీలు.

14 అనసూయ-కథానాయిక
15 లక్ష్మి } త్రిదేవులు
16 సరస్వతి } త్రిదేవులు
17 పార్వతి } త్రిదేవులు
18 నర్మద-కౌశికునిసతి
19 గంగ-సురనది
20 ఆకాశవాణి
21 ఒకమాలది



# సతీ అనసూయ.

## ప్రథమాఙ్కమ్.



ప్రథమదృశ్యము—అంధకారము.

పాపములు—(వికృతాకారములతో వారుచు, గంతులు వేయుచున్నవి.)

(అనుబంధము ౧)

(అంధకారము మేఘమండలముగ మారుచున్నది.)

(గంగ ఆకాశమునుండి మెల్లగ దిగుచున్నది.)

గంగ—[అను.3] హా! పరాత్పరా! దీనబంధూ! నన్నీ పాపము లనుండి రక్షించువారెవ్వరు? నాలో మునుంగు పాపాత్ముల దురితము లన్నియు నీవిధముగ నన్ను వెంబడించుచున్నవి. ఎన్ని ప్రదేశములు సంచరించిన నీ బాధ తప్పుటలేదుగదా! దేవాదిదేవా! దీనబంధూ స్వయంభూ! లోకరక్షకా? పాహిమాం! పాహిమాం!

(అనుబంధము ౨)

(ఆకాశవాణి ప్రత్యక్షమగుచున్నది.)

ఆకా—దేవి! భాగీరథీ! నీ యాక్రందనము నాలకించి జాలిః దితిని. నే నాకాశవాణిని. గంగామతల్లివగు నీవు సుఖించిన లోకంః లాగునే?

గీ. సకల కలుషముల్ హరియింపఁ జాలునీకు
కలుషమేమిటికమ్మ! గంగాభవాని!
పరమపావనియగు పతివ్రతనుఁజేరి
ప్రార్థనము సేయుమీ వెత బాయునీకు,
నీకు శుభంబగుఁగాక! నేఁ బోయెద.

(అను—గి—ప్రస్థానము)

గంగ—ధన్యోస్మి! ధన్యోస్మి!! ఈ యాకాశవాణి నాకెంత మేలుగావించినది! నేనిప్పుడు వైకుంఠమునకరిగి మహాపతివ్రతయగు లక్ష్మిం బ్రార్థించెదను.

పాప—(అను ౨) (అందఱు ప్రస్థానము)

---

ద్వితీయ దృశ్యము—ఆకాశమార్గము.

---

నార—ప్ర. (అను ౬)

అక్కటా! నాబాధ నెవ్వరితోఁ జెప్పుకొందును?

గీ. అనయమును కలహంబు భోజనము బెట్టి
నన్ను విధి సృజియించియున్నను మదీయ
పూర్వఫలమునఁ బోరాటములు దొరుకమిఁ
జేసి యుపోషవాసంబుఁ జేయుచుంటి.

ఇప్పుడేవిధముగ నెవ్వరికిఁబోరాటముఁబెట్టి నాకడుపునింపుకొందును? (ఆలోచించి) ఆఁ! తెలసె- తెలసె- యోగదృష్టింజూడఁగా తనకుఁ గలిగిన పాపములం బరిహరించుకొనఁ దలఁచి, గంగామతల్లి వైకుంఠమున కేగుచున్నట్లు తెలిసినది. ఏమి యీగంగవెఱ్ఱి! మహాగర్వమున లోకేశ్వరులగు తన భర్తలనుసయితము సరకుసేయకున్న త్రిమూర్తుల

భార్యల కీ గంగపాపములఁ బోఁద్రోలుసాటి సామర్థ్యమెక్కడిది? వీరు నిశ్చయముగ నీ ప్రయత్నమున భగ్నమనోరథ లయ్యెదరు, భూలోకమున వెలయు నత్రిమహర్షి సతియగు ననసూయాసతియే, ఈమహా కార్యమునకు ససమర్థురాలు. నేనిప్పు డీగంగ ననసూయకడకుఁ బొమ్మని చెప్పెదు నేని గంగా, సరస్వతీ పార్వతుల కలుకరాకమానదు. అప్పుడు వార లాయనసూయను పరిశోధింపకపోరు. వహ్వా! వహ్వా! ఎంతచక్కని యాలోచనఁ జేసితిని! ఇది నాకు చక్కని వింతగదా ! పెట్టిన నిట్టి కలహమే పెట్టవలయును.

సీ. పతిమాట తన కొంగు బంగారు మూటగాఁ
దలపోసి యలరెడు ధన్యచరిత
ప్రాణేశుఁడే తన భగవంతునిగ నెంచి
ధ్యానించుచుండు సన్మాననీయ
ధవుని చింతనమే సదావృత్తియని నమ్మి
పూజించుచుండు సద్వ్రతచరిత్ర
సకల సద్గుణగణ సంపూర్ణయై లోక
పావనియైన శుంభత్ప్రభావ
అందమున రతి తాలిమియందు ధరణి
యైన, యనసూయ సాధ్వీమహాత్మ్య మమర
నది కతంబున నాచంద్రమై తనర్చు
నఖిల దిఙ్మండలాంతము లలముకొనుచు.

నేనిక సత్వరముగ వైకుంఠమున కరిగెదను.

(అను 2)

(ప్రస్థానము.)

# సతీ అనసూయ.

## —• తృతీయ దృశ్యము — వైకుంఠము. •—

అగ్ర్యాసనములపయి లక్ష్మి, సరస్వతి, పార్వతి ప్ర.

[ పాపములు తరుముకొని రాగా గంగ ప్ర॥ ]

పాప—(అను ౨)

గంగ—[అను ౭] దైవసతీమణులారా! ఇందిరా సరస్వతీ శారదాంబలారా! రక్షమాం! రక్షమాం!

త్రిదేవులు—గంగామతల్లీ! నీకేమి విపత్తు సంభవించినది?

గంగ—తల్లులారా! వినుఁడు.

గీ. సకలజనుల పాపము లేను సంహరింప
నవి నను హరింప మొదలిడె నమ్మలార!
యతితరంబైన సాధ్వీమహాత్మ్యమునను
కలుషము నడంచి ననువేగఁ గావరమ్మ॥

మహాపతివ్రతలగువారి శాపంబునంగాక నీ కలుషములణంగఁజాలవని యాకాశవాణి వచించెను. తల్లులారా! మీకన్నఁ బతివ్రతలెవ్వరు? నను రక్షింపుఁడు.

త్రిదే—(అను ౯)

లక్ష్మి—చెలీ! పార్వతీ! అమ్మాయీ! సరస్వతీ! నేనీ గంగా మహాదేవి యార్తి బాపెదను. చూడుఁడు.

(కమండలోదకముం గొని)

గీ. అఖిల లోకైకమాత నేనగుదునేని
నావిభుఁడు లోక పతియైన దేవుఁడేని
ధవునియెడ భక్తిఁ బాయనిదాననేని
కలుషములు భస్మమై పోవుఁగాక! నేఁడు. (చల్లును)

పాప—(భస్మముగాక అట్టహాసము చేయును) (అను.)

గంగ—సాధ్వులారా ! రక్షింపుఁడు! రక్షింపుఁడు!

లక్ష్మి—చెలీ! పార్వతీ!నేనేమైన నపచారముఁజేసియున్నానా?

పార్వ—సఖీ! నేఁడు నీవనిర్మలవై యున్నట్లున్నావు. నేను వీని మదమణంచెద నుండుము. (కమండలోదకముంగొని)

గీ. విగతకలుషయౌ సాధ్వి నేనగుదునేని
జగతికెల్లఁ బరాశక్తి లగుదునేని
సర్వలయ మూర్తి శంకరుసతిన యేని
కలుషములు భస్మమై పోవుఁగాక ! నేఁడు. (చల్లును)

పాప—(భస్మముఁగాక అట్టహాసము చేయుచున్నవి. అను—వి)

గంగ—హా! తల్లులారా ! రక్షింపుఁడు.

సర—చెల్లెలా! నీవుంశుము. నేనె వీనిని సంహరించెదను.

(కమండలోదకముం గొని)

గీ. వేదములు నాయెడల నుద్భవించునేని,
యఖిల శబ్ద పరబ్రహ్మ నగుదునేని,
యల చతుర్ముఖ నికటంపు టతివనేని,
కలుషములు భస్మమైపోవుఁగాక! నేఁడు. (చల్లును.)

పాప—(భస్మముగాక) అట్టహాసముచేయుచున్నవి. (అను—వి)

గంగ—మాతలారా! రక్షింపుఁడు. రక్షింపుఁడు!

లక్ష్మి—గంగా! నీ వాకాశవాణి యాదేశమును పొరబాటుగ వినవుగదా !

పార్వ—భాగీరథీ ! నీకలుషము లీవిధమున నివృత్తిగాఁజాలవు

గంగ—హా! ఆకాశవాణి యాదేశమును పొరపాటుగవింటినను

చున్నారా? లేదు. తల్లీ! పొరపాటుగ వినలేదు. కాని నాయదృష్టమే పొరపాటుగ నున్నది. అందులకు మీరేమి చేయఁగలరు? ఓ లోకరక్షకా! దీనబంధూ! పాపులను నాదరిఁజేర్చి రక్షించినందులకా నాకీపాటు గల్పించితివి? లోకరక్షణముకొరకే నాకిట్టిపాటు గలిగినచో లోకనిక్షేపుల కెట్టి దుస్థితులు గలుగవలయు? నా యెఱింగినంతవఱకు నేనొనరించిన దోసములేమియును లేవే? నన్నిటులేల శిక్షించెదవు? సకల లోకాంతర్యామివై సర్వకాలములందు నిన్ను భక్తితో స్మరించెడు వారల యాపదలం బాపుటయే నీ యభీష్టముగదా! నన్నిటులేల సహియించుచున్నావు? నీకిది ధర్మమా? యుక్తకర్మమా?

(అను ౧౦)

నారదాదిమునీంద్రవందితచరణారవిందా! గోవిందా! రక్షింపుము.

నారదుడు—(ప్ర.)

(అ. ౧౧.)

గంగ—మునీంద్రా! నమస్కారము.

నార—సుమంగలీభవ! భాగీరథీ! నీ చరిత్రమునంతను నేను దివ్యదృష్టిచే నెఱింగితిని. నిన్ను త్రిభువనంబుల రక్షింపఁగల పతివ్రత దేవతలలో నెందును లేదు. భూలోకంబున మహామునిశ్రేష్ఠుఁడగు నత్రి యనునాతని కనసూయయను సాధ్వీతిలకముగలదు. ఆమెను నీవు శరణంబు వేఁడితివేని, నీపాపంబులు పటాపంచలగును, శీఘ్రముగ నచ్చటికేఁ బొమ్ము.

(అను ౧౨,)

గంగ—మహాత్మా! ధన్యురాలనైతిని. (ప్రస్థానము)

(వెంబడించును)

పాప—(అను ౧౨)

నార—ఇందిరా భవానీశారదాంబలారా! మీకుంగుశలమా?

లక్ష్మి—నారదా! మా కుశలమున కేమిగాని, ఇప్పుడు భాగీరథితో నేమియో చెప్పుచుంటివి. మేము తిన్నగ వినలేదు. మఱియొకసారి చెప్పుము.

నార—ఒకసారిగాదు. వేయిమాఱులా సాక్షిసేప తలపెట్టినను దోసము లేదు. ఆయనసూయాదేవి మహాత్మ్యము వినుఁడు.

సీ. పాపంబులను పటాపంచలుగావించి
చండాలురకును మోక్షము నొసంగు
నలుకవహించెనా యఖిలరాత్రించర
సంఘంబునైన భస్మంబొనర్చు
తన సదయపతివ్రతాశక్తిచే ఘోర
సర్పమైనను పూలసరముఁ జేయు
మృతినొందినట్టి దుర్గతునైన క్షణములో
ఘనపునర్జీవితునిగాఁ నొనర్చు
నెదను మన్మథుఁడైన చలింపఁబోక
దోషమునడంచి భయకంపితునిగఁ జేయు
లలిఁ ద్రిమూర్తుల నైన బాలకులఁ జేయు
తరమె యనసూయ ఘనమహాత్మ్యంబుఁ దెలుప.

లక్ష్మి—నారదా! చాలు—చాలు మర్త్యాంగనయఁట! పతివ్రతయఁట! భాగీరథి పాపంబులు వాపునఁట! కలహప్రియుండవగుటను నీకొకరిని నిందించుటయే స్వభావమగుటచే నటులందువు. భూలోకమేమి? సాధ్వీత్వమునకు నెలవగు ఏడ ? ఇది యెవ్వరైన నమ్ముదురా? నారదా నీగుణమును వదలవైతివి గదా!

పార్వ—కలహభోజనా ! నారదా! నీ కెప్పుడు మనుష్యుల బొగడించుటయు, పాపములం దారితేరిన మర్త్యాంగనలను స్తుతించుటయే

వృత్తిగదా! ఛీ! ఛీ! నీబుద్ధి యింత నింద్యమని మొఱుంగమిగదా మతి లేని వేల్పులందరు నిన్నుఁ బెద్దఁజేసెదరు. ఇట్టియబద్ధములు వచించిన నీకేమి లాభము ?

నార—అమ్మా! నేనువచించిన దేవియు నన్నృతముగాదు. ఆ యనసూయామహాదేవి సకలగుణసంభరిత — పతిభక్తినిరత — శుభచరిత — మీ కలుకగలిగిన నేమియుఁ జెప్పలేను. కాని, మీరు సహిత మాసాధ్వీమూలమునఁ బవిత్రులు గావలయునని నాయభిమతము. మీ పతులు సహితసూమెను మాతృభావమునఁ గాంచు శుభకాలమును, నేనీ కన్నులతోఁ జూడకపోను. సత్యమును వచించుటయే నాయభిమతము. కావున నట్లు వచించితిని. సర్వజ్ఞులగు మీ కలుకగలిగిన నేనేమి చేయువాఁడను.

త్రిదే—( అనుబంధము ౧౩. )

లక్ష్మి—నారదా! నేను పతివ్రతను గానని యేనా నీయభిప్రాయము ?

నార—అమ్మా! కారని కాదు. గాని మీరును గొన్నిలోపములు గలవు. ఆమె కా లోపములును లేవని నానమ్మకము.

లక్ష్మి—నాకేమి లోపమున్నది ?

నార—సీ. ఓరమా! రామావతారకాలమునాఁడు
లేడిఁ దెమ్మని నీవు వేఁడినావు
అది రామచంద్రుని కహితమాటనె నీవు
కడలేని యిడుములఁ గుడిచినావు

పార్వ—నారదా! నాకేమి లోపమున్నది ?

నార— సీ. శాంభవీ! నాఁడు దక్షప్రజాపతియజ్ఞ
మరయు కోరికను నీ వరిగినావు

అది పరమేశున కహితమౌటనె నీవు
కడలేని యిడుములఁ గుడిచినావు

సర—విధితనయా! నాకేమి లోపమున్నది ?

నార— సీ. శారదా! విద్యావిశారదవౌ నీవు
పతిముఖంబిల్లుగాఁ బరగినావు
ఆకారణంబున నతి దరిద్రులపొంత
జెలఁగెడు పుస్త్రాప్తిఁ జెందినావు
గీ. సకలభువనైక పావన జననులార
శారదా! శాంభవీ! పద్మవదనలార !
సాధ్వి యనసూయ భువన విశ్రాంత కీర్తి
యామె కేలోపములుఁ గల్గవమ్మ నిజము.

పార్వ—ఏమినారదా! భట్రాజువలె పొగడఁ జొచ్చితివి! నీ కనసూయ యనిన మహాభిమానముగా నున్నదే!

లక్ష్మి—పోనిమ్మాతని కభిమానమున్ననేమి, లేకున్ననేమి! ఆ యనసూయ మనతలదన్ను సాధ్వియైనచో మనము చూడఁదగినదే! నారదా! మీకు నిదర్శనము జూపఁగలవా!

నార—అమ్మా ! వేరు నిదర్శనమేమి కావలయును? భాగీరథీ విషయమే మిమ్ముల సంతృప్తులఁ జేయఁగలదు. మీరు స్వయముగ నాచరిత్రమునుఁ జూచిరండు.

పార్వ—ఇది మంచిపద్ధతి.

లక్ష్మి—అవును. మనమిప్పుడే పోవుదము.

నార—అమ్మా ! ఒక్కమారిటుల వచ్చెదరా !

లక్ష్మి—ఏమి ?

నార—(ఉత్తరీయము చెంగులో చేయినిడి సవరించుకొనుచుండును.)

లక్ష్మి—అదేమి అదేమి ? ఏదయిన ఫలాహారము దెచ్చుకొంటి వా యేమి ?

సర:—అతనికి కలహములే ఫలాహారములు. వేరేమికావలయు?

పార్వ—నారదా! మాటాడవేమి? ఒడిలోని మూటదలకు నోరూరుచున్నదా యేమి ?

నార:—(చూపుచు) ఏదమ్మా! వట్టి గులకరాళ్ళు.

లక్ష్మి:-నీకేమి పైత్యమా నారదా ! గులకరాళ్లు దెచ్చుకొం టివి ?

నార;—ఆఁకలి యగుచున్నదమ్మా.

లక్ష్మి.—ఆఁకలి తీరుటకు గులకరాళ్ళు తినెదవా యేమి ?

నార.—మీరాదయయుండి వండిపెట్టినచో—

సర:—సరిపోయె. వెఱ్ఱికుదిరినది. రోఁకలి తలకుఁ జుట్టు మనినట్లున్నది.

నార—వెఱ్ఱియును లేదు — రోఁకలియును లేదు. తలకుఁజుట్టు మనునంత యవివేకినికాను.

లక్ష్మి:-కాకేమి ? నారదా ! గులకరాళ్లు వండిపెట్టవలయునం టివిగదా !

నార:—సాధ్వులని — అమోఘవాఙ్మాత్రమున ప్రపంచమును తల క్రిందుగఁ జేయు పవిత్రశీలలని గంపెడు విశ్వాసమున నాయాఁకలి తీరుననుకొని గులకరాళ్ళు తెచ్చుకొంటిని. గాని యాశాభంగమైనది.

లక్ష్మి:—సరిసరి! ఇంతకవిశ్వాసుఁడవు తేలుమంత్ర మెఱుఁగవా యన్నట్లు మాటాడు నీకేమి ప్రత్యుత్తర మీయఁగలము? తినుటకు పంచభక్ష్యభోజ్యము లనేకములుండ రాలు తినెదనన్న వికారగుణమేమి నీకు ?—

నార:—తల్లీ! అటులనా! తెలిసినదికాదు. నాయభిప్రాయమున—

గీ. అరుగుటైనఁగాని యరికట్టవలయు. రా
లైన వండవలయు—నల్పద్రిమూర్తి
గణమునయిన శిశువులఁ గావింపవలయు; నీ
జగతి నామెగాదె సాధ్వియనఁగ!

లక్ష్మి—ఓహో! ఎంత విచిత్రోపన్యాసము! నారదా! ఒకవేళ మీయనసూయ యీపనులన్నియుఁ జేయగలదేమో! అడిగిచూడుము.

నార—ఉపవాసముందునా యెవ్వరినడుగక. కానిండు. అనసూయనే యడిగెదను.

లక్ష్మి—ఒకమాట—ఆయనసూయ యీ గులకరాళ్ళను నీకు వేయించి ఫలాహారముగా నిడినప్పుడు మమ్ము మఱువక మాకును బెట్టుముసుమా!

నార—ఆహా! అభ్యంతరమేమి? కాని మీరుముగ్గురుఁ గలసి తింటిరా నాకుఁదక్కునా?

సర—బాగున్నది. మీరు కొనఁబోవుగేదె మావేయఁబోవు బచ్చలిపాదు మేసినదన్నట్లున్నది. !

లక్ష్మి—ప్రొద్దుపోని మాటలతో నేమి? భారతీ! శాంకరీ రండు పోవుదము.

నార—అమ్మా! నాకు సెలవు.

లక్ష్మి—మంచిది. అనసూయమాట మరచిపోకు.

నార—మీరును మఱువవద్దు.

లక్ష్మి—మేమా మఱచునది! ఇప్పుడే చని పరీక్షింపమా?

[ప్రస్థానము]

నార—(స్వ॥) ఆఁ! ఎంతగర్వ మీత్రిదేవులకు? తొందఱయేల? శీఘ్రముగ నణఁగనున్నది. (అనుబంధము ౧౮)

శ్రీ

# సతీ అనసూయ.

ద్వితీయాంకము.

ప్రథమదృశ్యము — అత్రిమున్యాశ్రమభూమి.

అన — [కమండలముతో ప్ర॥) (అనుబంధము. ౧౫)

ఆహా! సతియైజన్మించినదానికి పతిభక్తియేకదా తారకము!

సీ. సంసారమును మహాసాగరంబుఁ దరింపఁ
ప్రాణనాథునిసేవ యానపాత్ర
అసమాన విషయసౌఖ్యపిశాచములఁ ద్రోల
రమణునామంబె మారణజపంబు
భవమహాశాపాశ బంధమ్ములం ద్రెంచ
నాత్మేశు బోధ ఘోరాశిధార
కనుమాయు కలుషాంధకారంబు నణఁగింప
భర్తృచింతనము దివ్యాంజనంబు
తరళ గతిలేనిముక్తిసౌధంబుఁ జేరఁ
ప్రాణనాథునిభక్తి సోపానపంక్తి
జీవయాత్రనుగావింప జీవితేశు
ప్రవిలవంబైన సయ్యాట రాజబాట.

నానాథునియాజ్ఞానుసారంబుగా నుదకంబునకై వచ్చిన నాకెందును పుడసెడునీళ్ళయినఁ గాన్పింపవే! కారణమేమిచెప్పుమా!

(పాపములు వెంటరా, గంగ తత్తరముతో ప్ర॥)

పాప—(అనుబంధము ౨)

గంగ—అనసూయాసతీ! గుణవతీ! నేను గంగను. ఈపాపములు నావెంటఁబడి పీడించుచున్నవి. నీకు వలయు జలంబులను నేనొసంగెదను. నన్ను రక్షింపుము.

అన—అమ్మా! లోకంబులను పవిత్రముగావించు నీ కల్పజ్ఞ నగు నాసహాయమా? నాయందు నీ కట్టి విశ్వాసముగలిగి వచ్చితివి. గావున, నాపతి తపోమహిమంబున నటులే నీ వెత బాయఁగలదు; కాని, నాప్రభునికొఱకు జలంబులనొసఁగి రక్షింపుము.

గంగ—అట్లే జలంబులఁ బరిగ్రహింపుము. [ఒసంగును.*)

అన—[జలంబులఁగొని] తల్లీ!—ధన్యనైతిని, నిన్నుఁ జిరకాలమునుండియు బాధించు నీపాపంబులిదే భస్మీపటంబగును. చూడుము.

మ. అనయంబుం బతిపాదచింతనమునం దానందముంబొందు నె
మ్మనముం గల్గినదాననేని పరమామ్నాయాను ధర్మంబు స
ల్పిన సాధ్వీమణినేని దైవతనదీ వీచీగతాఘుంబు లె
ల్లను, భస్మంబగుఁగాక! జీవితములెల్లంబాసి నాశంబులై.

(పాపములు భస్మముకాఁగా తెరవ్రాలును)

---

దృశ్యము ౨—వైకుంఠము.

ప్రవేశము—లక్ష్మి, సరస్వతి, పార్వతి.

పార్వ—అక్కా! సరోజసంభవా!

గీ. కాంచితిమి కన్నులార; గంగాభవాని
కలుషసంతతు లనసూయ కారణమున

---

* ఇచ్చట పాతాళ జలయంత్రము చూపవలయును.

భస్మమగుటయు; నామె కాపంగబడుట:
సంశయంబు లే దనసూయ సాధ్వియగును.

లక్ష్మి—చెలీ! పార్వతీ—ఆమె సాధ్వియే యని పల్కుచుంటి వా? చాలు చాలు నీసిగ్గు చితికినట్లేయున్నదిలే! దేవకాంతలమై జగత్కర్తలగు బ్రహ్మవిష్ణుమహేశ్వరుల సతులమగు మనము గావింపలేని యొక కార్యమును మానవాంగన గావించుటయు, దానికి నారదుండెంతో మసలదూషించుటయు, గన్నులారం జూచియు నిటులా యనసూయనింకను మెచ్చుకొందువేమి. ఇది మనకు మహావమానముగాదా? ఎటులైన నామానవాంగన నవమాన పఱచి, యసాధ్వి యనిపించిన గాని మనకీదుఃఖము తీరదు, కోడలా! సరస్వతీ! నీ వేమందువు?

సర—అత్తా! నీయభిమతమే నాయభితము.

లక్ష్మి—గౌరీ! సరస్వతీ! నాయుద్దేశము నాలకింపుండు.

[అనుబంధము ౧౬)

ఆ. అవని మనకు నెట్టియవమానమైన రా
నిమ్ము, కీర్తి పోవనిమ్ము; మనదు
జీవితేశ్వరులకు చిన్నతనమ్మె రా
నిమ్ము సాధ్విం జేతునమ్మదాని.

పార్వ—ఇది నాకభిమతము

సర—ఇది నాకంగీకారము.

లక్ష్మి—ఇదిగో! నారదుం డిటే వచ్చుచున్నాడు.

నార—ప్ర॥ (అను ౧౭]

నార—అమ్మా! మీకందఱికిని దాసుని నమస్కారములు.

లక్ష్మి—అబ్బాయీ! నారదా! అనసూయంజూచితిమి, ఆనందించితిమి. ఆమె నీపొగడ్తకుం దగినదిగదా! నీవుగాంచి యానందించితివా?

పార్వ—నారదా! మమ్ముల నవమానించుటయే నీకు పని; గావున మా యవమానముంగని మరియొక మా రానందింపుము.

నార—అమ్మా! శాంకరీ! నాకిందెవ్వ రన్యులు? లోకమాత యగు నిందిరాదేవిగారు నాకుఁ బితామహియు, నీ శారదాదేవి తల్లి గారునుగదా! ఇఁకనీవా! జగద్ధాత్రివి; చెప్పవలసిన దేమున్నది? మిమ్ముల నవమానించుట నామత మెట్లగును? అట్లవమానించిన నాకేమి లాభము? నిజమాడిన నిష్ఠురమయ్యెనను చందము గలిగెఁగదా? అదిగాక, అమ్మా! అనసూయ పతివ్రతయైనంత మాత్రమున మీకీదుఃఖమేటికి? ఆయమం గని యానందించుటకు మీరు విచారించెద రేమి?

పార్వ—ఏమి నారదా! మమ్మోర్వాళ్ళ పరవశలనుఁగా భావించి నట్లున్నావు? మీ యనసూయయెంత గొప్పదైనను మేమంత దుస్స్వభావల మగుదుమా? కాకతాళీయముగ గంగపాపములఁ బోఁద్రోలినంతనే సరికాదు. త్రిలోకపూజనీయ సమర్థత కలుగవలదా!

గీ. దీనులకు సిరులిచ్చు శ్రీదేవికన్న
బ్రహ్మవిద్యానిధాని యీ వాణికన్న
ఖలుల నాశనముజేయు నాకన్న నామె
యెందధికురాలో! వేఁగ వచింపుమయ్య.

నార—అమ్మా! నేను మిమ్మవమానింపలేదు. కేవలము యదార్థమును వచించితిని. ఐనను, నీవడిగితివి; కావున నాకుఁదోచిన తెఱఁ గెఱిగించెదను. వినుము.

సీ. తలఁచెనా—లోకసంతానమెల్లను నామె
మహిమచేత సువర్ణమయముజేయు,
ఆసతి భర్తృనామామృత ధ్యానంబె
ఘన బ్రహ్మవిద్యాధికంబు సుమ్మ,

ఖలవినాశంబు సత్కులజ పోషణము నా
తన్వి కత్యల్పమాత్రంబులమ్మ,
మూడుమూర్తులును నాముదితకు తనభర్త
చెంత పుత్రులుగ గాన్పింతురమ్మ,

ఏంతయేటికి? శాంకరీ! విను; తెలిపెద
నించుకాసతి యలుక వహించెనేని
భువనములు మూఁడు భస్మమై పోవునమ్మ
నాతి యనసూయ ప్రకృతికతీతసుమ్మ!

లక్ష్మి—నారదా! గ్రుడ్డువచ్చి పిల్లను వెకిరించినట్లు నీవు వచ్చి యనసూయను పొగడి మమ్మాక్షేపింప నక్కఱలేదు. భూలోక కాంతల పావనత మే మెఱుంగనిదికాదు. బాలుఁడవగుటచే, ప్రపంచ జ్ఞానములేక నీ విట్లాడుచున్నావు. నీయనసూయ నసాధ్వియని నీచోట ననిపించెద; చూఁడుము.

నార—అమ్మా! వట్టిప్రగల్భములతో లాభమేమి? ఆ కార్యము మీవలనగాదు; మానుఁడు. [అను ౧౭]

లక్ష్మి—కానిమ్ము. ఆమె పావనతయేదియో తెలిసికొనవలసినదే. శారదా! గౌరీ రండు. మీ కామె నవమానించు తెఱఁగు దెలిపెదను. (ప్రస్థానము)

నార— (అను ౧౮)

---

దృశ్యము—కైలాసము.



పార్వ— (అను ౨౦)

ఈ కార్యమును భృంగీశ్వరునిచే నిర్వహింపం జేయుటయే సమంజసమని మాకుఁదోఁచుచున్నది... భృంగీశ్వరా! ఇట్లొకమారు వచ్చెదవా?

భృంగి—[ప్ర॥] అమ్మా! ఏమిసెలవు?

పార్వ—నీవలన నొకకార్యము కావలసివచ్చినది.

భృంగి—ఎన్నడైన నీయానతి నిరాకరించితినే! సెలవిమ్మా.

పార్వ—గీ. వసుధలో నత్రియును ఋషీశ్వరుఁడు గలఁడు;
సుదతి యతనికిఁ గల దనసూయ యనఁగ
నామె గౌరవ మెట్లైన నపహరించి,
కులటయను ధుర్యశంబునుఁ గూర్పవలయు.

ఇందులకు వలయు నుపాయమును నేనెఱింగించెదను; రమ్మా.

(ప్రస్థానము)



దృశ్యము—౪ అత్రిమున్యాశ్రమము.

---

అ—సతీ! అనసూయా! నీవీ పతివ్రతా ధర్మఘట్టమును వినవలయును.

అన—దేవా! జాగరూకతతో నున్నాను.

అ—[చదువుచున్నాఁడు]

గీ. సత్కులజుఁడైన, మిగుల దుర్జాతుఁడైన,
రూపవంతుఁడైయైన కురూపియైన,
భూదయితుఁడైన, నతి నిరుపేదయైన,
నీశ్వరుఁడు కాంతకెవ్వఁడు ప్రాణేశ్వరుండె.

అన—ప్రాణేశ్వరా! ద్రాక్షామకరందేక్షు రసమధురంబగు నీ కావ్యము, సాధ్వీజనంబులకు చింతామణిగదా. తరువాత వినిపింపుడు.

అ—[చదువుచున్నాఁడు]

గీ. పతియె దైవంబుగను, పతిపాదతీర్థ
సేవనమె సంతతము తన జీవనముగ
ధవునిచింతయె పరమ మంత్రంబుగాఁగ
కాంత తనలోకయాత్రను గడుపవలయు.

అన—నాథా! భగవంతుఁడు లోకములోని సతులనందఱను పరీక్షించుచు నిండారునానందము నీయఁజాలకున్నను, నాకుమాత్రము పరిపూర్ణ సౌఖ్య మిచ్చియున్నాఁడు.

అ—వెఱ్ఱిదానా! అప్పుడే భగవంతుఁడు నిన్ను పరీక్షింపని దినము గడచినదా ఏరూపమున పరమేశ్వరుఁడు మానవులనెట్లు పరీక్షించునో యెవ్వరెఱుంగుదురు?

సీ. బుద్ధిమతీదేవి పుత్రశోకముఁ గాంచి
శ్రీహరుచేఁ బరీక్షింపఁబడియె,
సత్యదేవత హరిశ్చంద్రుండు కౌశికు
చేత నెంతయుఁ బరీక్షింపఁబడియెఁ
చీము కండలుగోసి సిబిచక్రవర్తి మ
హేంద్రునిచేఁ బరీక్షింపఁబడియె,
అవమానమందిన ధ్రువకుమారుండు గా
సిలి, విష్ణుచేఁ బరీక్షింపఁబడియె.
వెదకిచూడంగ పదునాల్గు విశ్వములను
యశమునందినవారు దివ్యతతిచేత
బంధురముగఁ బరీక్షింపఁబడినవారె
క్రాగి తేజమునందు బంగారమట్లు.

అన—నాథా! ఆపరీక్షయు మఱింత కీర్తికే కారణమగును. కావున వగవంబని లేదు.

అ—ఐనను మహారణ్యముల కందమూలములందినుచు, దర్భశయనములందుండి నారచీరెలు గట్టుచున్న నీకు, నావలన నేమిసౌఖ్యమున్నది ?

అన—నాథా! అట్లనం జెల్లునా !

సీ. పతిదండ నివసించు పడతికి మహాదర
ణ్యప్రదేశమునందనంబుగాదె?
ధవుప్రేమనందిన తరుణికి కందమూ
లంబె మృష్టాన్న పానంబుగాదె ?
నాథునిసేవించు నాతికి భీకర
కష్టవ్రజంబె సుఖంబుగాదె?
కాంతు సంగతిగల్గు కమలాయతాక్షికి
కడులేమి పరమభాగ్యంబుగాదె!
గీ. సతికి ననుకూలతంగల పతి లభింప
భవన మదియేల? భర్మసౌభాగ్యమేల?
శోకమదియేల? మరి వేఱులోకమేల?
వనితలకు ముక్తి భర్తృసేవాప్రసక్తి.

అ—నీయట్టి విజ్ఞానసంపదగల వనితను భార్యగాం బడయువాండును ధన్యతముండేయని నాయభిప్రాయము.

(తెరలో)

ఓహో! లోకంబున ధర్మాత్ములెందును లేరే! క్షుద్బాధకుం దాళంజాలకున్నాను గదా! పుడిసెడు నీళ్ళను, పిడికెడు మెతుకులు నిచ్చి పోషించువారెవ్వరును లేరే!

ఉ. నాలుగునాళ్ళనుండి యశనంబును, పానము లేక, కానలోం
గాలము బుచ్చినాండను. జగంబున నెందును దాతలేండె? భూ

పాలురు కాలమందిరే! విపన్నులఁ బ్రోచు మునీంద్రులైన, నా నాలుక కింతపాటి యశనంబునుఁ నీరము నీయజాలరే!

అన—నాథా! ఆ యార్తధ్వని యేమైయుండును?

అ—దేవీ! ఎవ్వఁడో యొక యతిథి పాప మాహారవాంఛచే వచ్చియుండనోపును. ఉత్తమగార్హస్థ్యధర్మ మతిథిసత్కారమేగదా! కావున నీవాతనిని సత్కరించి రమ్ము.

భృంగి—(ప్ర) ఏదో కపటోపాయంబున నీమెకు దుష్ట యని పింపవలయును. ఇప్పుడాఁకలియని నెపము పెట్టెదను. హా! దైవమా! ఆకఁలి! ఆకఁలి.

అన—(బయటకు వచ్చి) ఆకఁలి యాకఁలియని యాక్రందించు నోయతిథీ! భీతిల్లకుము. ఒక్కక్షణమోర్చి యుండుము. నానాథుని సేవయయిన పిదప నీకాహారమిచ్చెదను.

భృంగి—ఇంకను నాథుని సేవయా! ఆహా! ఆకలిచే చచ్చు బ్రాహ్మణుని వాఁకిట నిలపి నాథుని సేవయని పలుకుచుంటివా! గొప్ప యిల్లాలివలె నున్నావే! కానిమ్ము. నాప్రాణము లిచ్చటనే పోయిన నాపుణ్యము నీకేదక్కగలదు. హాపరమేశ్వరా! ఆఁకలి, ఆఁకలి,

అన—అయ్యా! తెలియక పలికితివి గావున నీవునిర్దోషివేయగు దువు. నేను వచ్చువఱకు నిందోర్చియుండుము. (లోపలకుఁ బోవును)

అ—ప్రాణేశ్వరీ ! నాజపసమయమయినది. కావున వలయు పదార్థములను సేకరింపుము. నేను జపశాల కరిగెదను. (ప్రస్థానము.)

అన— (ప్రస్థానము)

భృంగి—హా! పరమేశ్వరా! ఆఁకలి-ఆఁకలి—ఏమి యనసూయా !నీకింకను తీరికగాలేదుగా! అయ్యయో! నాప్రాణములు పోయిన పిదప నీకు తీరిక యగునేమో! గర్భకోశమంతయు ద్రాటియా

కులమంట బెట్టినట్లు భగభగమండుచుండగా—సెట్లోర్చియుండఁగలను హా—భరింపలేను—భరింపలేను—నాలుక తడబడుచున్నది—శరీరము తూలిపోవుచున్నది. ఏమి యనసూయా! నాకింత తిండివేయవుగా! ఓసి దురాగ్రహురాలా! అతిథులనిన నీకెంత నిర్లక్ష్యమే!—గుమ్మములో నాఁకలిచే నొక బ్రాహ్మణుఁడు ప్రాణములు విడుచుటకు సంసిద్ధుడయియుండఁగా నీవు పతి కుపచారములు చేయుచున్నని వదలి చనుట కు నీమనసెట్లొప్పినది? నీకెన్ని కాళ్ళువచ్చినవి? ఓభగవంతుఁడా! సన్నీ పాపాత్మురాలి నాఁకిట నేలవస్త్రైవైదితివి! అబ్బబ్బా!—ఆఁకలి—ఆఁకలి. ఈక్షుద్బాధఁదీర్చువారెవ్వరు? ప్రాణములు పోవసిద్ధముగనున్నవి. తల్లీ! నీవైన నాదగ్గఱ లేవే! దిక్కులేక—నట్టడవిలో— నీయత్రిముని వాకిట నాఁకలిచేఁ జావుమని నానుదట వ్రాసితివా! (ఆక్రందించును.)

అన—(సత్వరముగా నాహారముతోఁ (ప్ర.) ఓదేహి! త్వరపడకుము. నీకిదేయాహారము. భుజించి స్వస్థచిత్తుండవుగమ్ము. నీతల్లి పుత్రవంతురాలగునుగాక ! నేను దీర్ఘాయుష్యము లభించుగాక !

భృంగి—(ఆహారముంగాలితోఁదన్ని) ఛీ. ఛీ.—దురాగ్రహురాలా! అతిథులనిన నిరాకరణబుద్ధిగల నీయింట నొక కబళమైన భుజియింతునా ?

(అను ౨౧)

ఇదేచూడుము. నాజటయే యొక మహాభూతమై నిన్ను సంహరించును. (జటభూమిపైఁగొట్టగా భూతము పుట్టుచున్నది.)

భూ—దేవా ! నన్ను పిలిచిన కారణమేమి ? ఎవరిని భుజింపవలయును ?

భృంగి—భూతరాజా ! మదోన్మత్తురాలగు నీ యనసూయను భుజింపుము.

భూ—హా—హా—హా (మ్రింగవచ్చుచున్నది.)

(అను ౨౨)

అన—నేను నిజమగు పతివ్రత నయితినేని నాకీ భూత బాధ తొలంగుగాక!

భూ—హా! దురాత్మా! భృంగీ! ఈపతివ్రతనంటరా నీవు వధింపఁ దలంచినది! చూడు! నిన్నేమిచేసెదనో? (మ్రింగఁబోవును.)

భృంగి—హా!హా! అనసూయాదేవి! రక్షింపుము. రక్షింపుము. జ్ఞానహీనతచే నట్లాడితిని. దోషిని—దోషిని—నన్ను రక్షింపుము.

(పాదములపైఁ బడును.)

అన—తామసప్రధానుఁడవగు నోయతిథీ! రక్షింపఁబడితివి. ఓ భూతరాజా! నిలువుము.

గీ. శాంతమించుకయును దమ స్వాంతములను
గనక పరవంచనమె తమ కార్యముగనుఁ
బుడమిఁ దిరిగెడు క్రోధ సంపూర్ణమతుల
నశనముగఁ జేసికొమ్ము! నీవనవతరము.

భూత—(అంతర్ధానమగుచున్నది.)

భృంగి—దేవీ! అనసూయాసతీ! నీపాతివ్రత్యమహాత్మ్యంబర యనేక దుష్ప్రలాపంబులాడిన నాతప్పుగాచి రక్షింపుము. నీదయా రసంబున నేను జీవింపఁగంటిని.

అన—ఇట్టి పలుగాకి పనులెన్నడును చేయకుము.

(అను ౨౩) (ప్రస్థానము)

భృంగి—(అను ౨౪)

అమ్మయ్యా! ఇప్పటికి బ్రతికితిని. ఆయనసూయయే దయఁదలంపక పోయెనా— నేనీపాటి కా యమునింట ప్రాత కాపునైయుండ

వలసినదే ఓపార్వతీదేవీ! నీ పరీక్షచాలును. ఇఁకనయిన నామెకు దయ తోఁ జూచిన నీకు శుభము గల్గును.

పార్వ—(ప్ర) భృంగీ! నీపరాభవముం జూచితిని. నీవింతతో నధైర్యపడవలసిన పనిలేదు.

భృంగి—ఏమమ్మా! ఇంకను నన్నధైర్యపడవలదనియే చెప్పుచున్నావా? ఆయనసూయాదేవి దయాభరిత; కావున బ్రదికివచ్చితిని. కానిచో నాకొఱకు మీరందఱును విచారింపవలసి యుండెను. మా యమ్మ కడుపుకాలవలసిన దుర్యోగము పట్టియుండును. ఇఁకనయినను మీవెఱ్ఱి తలంపులను మానుడు—ఆమె మహాపతివ్రత.

పార్వ—భృంగీ! నీకు వెఱ్ఱిపట్టినదా? నారదునివలె నీవు సైత మా యనసూయను మెచ్చుకొనుచున్నావు.

భృంగి—అమ్మా! నారదుఁడును నేనేకాదు. నిశ్చయానిశ్చయ పరిజ్ఞానము గలవారందఱును నామె మహాపతివ్రతయని చెప్పక పోరు.

పార్వ—అట్లయిన నేను నిశ్చయానిశ్చయ పరిజ్ఞానము లేని దాననా ?

భృంగి—అమ్మా! నేనంతమాటాడగలనా? కాని, నామనవి యొకటి కలదు.

పార్వ—(కోపముతో) ఛీ-దుర్మార్గుఁడా! నాకు శ్రీరంగనీతు లుపదేశింపుమనియా భర్తగారు నీ కుపదేశించినది? నేను చెప్పినపనిఁ జేయుము. నీకితరప్రసక్తితో నిమిత్తములేదు. భర్తగారి మెడలోని కృష్ణసర్పముం గొనిపోయి, యాయనసూయ నిద్రఁబోవు భర్తకుప చారము సల్పుచుండఁగా మెడలోవేయుము. అప్పుడామె పాతివ్రత్యము వినాశమగును.

భృంగి—అమ్మా! కోపింపకుము—ఈకార్యమువలన నీకేమి లాభము?

పార్వ—ఛీ! దుష్టా! నాతో నధికప్రసంగము చేసెదవేమి? లాభమో నష్టమో యదినీకేల?—వేగముగ కదలెదవా, శపింప వలయునా?

భృంగి—(భయముతో ప్రస్థానము)

పార్వ—ఈమాఱు తప్పక నాయనసూయ గర్వభంగముకాక పోదు. నారదునిస్తుతిపాఠము లప్పుడుగదా తెలియవచ్చు.

నార—(ప్రవే)ఓహో! పార్వతీదేవిగారా! వందనములు.

పార—నారదా! విశేషములేమి?

నార—ఏమున్నవి మీకు తెలియనివి?—అట్లయినభృంగిపరాభ వింపఁ బడినాఁడుగదా! తిరిగి యేమయిన ననసూయా పరాభవ ప్రయ త్నము చేసితిరా, లేక పరాజయముతో నూరకుంటిరా?

పార్వ—ఊరకుందుమాఁనారదా! నీకంటికి మేమంత తేలిక గా నుంటిమి కాబోలును. ఒక్కమానవాంగన మాకన్న నధికురాల గుటంగాంచి యోర్వఁగలము?

నార—అమ్మా! శైలసుతా! నాకంటికి మీరు తేలికగా లేరుగాని—లోకమునకే మీరు తేలికయైతిరి. ఎలననగా—

సీ. ధవునాజ్ఞ నెదిరించి, దక్షప్రజాపతి
    యజ్ఞంబుఁ గన నేగినపుడు కొంత
లతాంగి నీదు కల్యాణ కాలమునాడు
    హరుని బిక్షుకుఁ జేసినపుడు కొంత
పతి గదా యను గౌరవంబింతలేక, న
    ర్ధాంగంబు జేరిన యపుడు కొంత

భయదాకృతినిఁగాల్చి పతి రొమ్మునెక్కి, నా
ట్యంబు గావించిన యపుడు కొంత
వినుము; ఏనాటి మాటలో వెనుక నేల,
నరసి యనసూయతో నోడినపుడు కొంత
యఖిల జగములకు నలంతి వైతివమ్మ
పలువిధంబుల నేనేలఁ బలుకవలయు ?

పార్వ—నారదా ! అట్లయిన నేను పతిభక్తిలేని దానననియే నీయభిప్రాయమా ! నేనా యనసూయనే యోడింపలేనా! చూడుము నాప్రతాపము. ఈకన్నులకీ రెప్పలుదూరములుగావు-

నార—అమ్మా! నిక్కము వచించితివి! ఈకన్నులకీ రెప్పలు దూరములుగావు చూచెదముగాక! తల్లీ! నీవు పతిభక్తి గలదానవో కావో గంగపాపములం బోఁదోలలేనినాఁడే తెలిసిపోయినది ; నీప్రతాపమును నేనుచూడనక్కఱలేదు. ప్రతాపముం జూపఁబోయినభృంగిపాట్లు చూచితిని; గదా! చాలును; దానికేమిగాని, పార్వతీదేవి! ఇంకను అనసూయను సాధించు తలపేనా! తాఁటియాకుల చప్పుళ్ళకు కుందేళ్లు బెదరునవిగావని యిప్పుడయిన తేటపడలేదా! ఎంతవెఱ్ఱిదానవమ్మా!

పార్వ—(సిగ్గుపడి తనలో) ఈనారదుఁడు నన్నొంటరిదానిం గావించి, యనేక విధముల దూషించుచున్నాఁడు. ఇప్పుడీతనితో నేమి చెప్పినను లాభములేదు. [ప్రకాశముగా] నారదా! నీసుగుణములెప్పుడు నున్నవే! వానికివగవంబనిలేదు. నేనుచేయఁబోవుపని చెప్పియుఁ బ్రయోజనములేదు. జరుగఁదగినవన్నియుఁ జూచెదవుగాక! నాకు ప్రస్తుతము పనియున్నది; నేఁబోవలయు— (ప్రస్థానము)

నార—వహ్వా—వహ్వా—కలహమహావృక్షము నెంతచక్కఁగా నాటితిని! అచిరకాలమున దానిఫలంబననుభవించి యానందింపకపోను.

ఈ కలహనాటకంబున లక్ష్మీ సరస్వతీ పార్వతులకే కాక, వారి మగలకును గర్వభంగము కాకపోదు. అప్పుడుగదా నాకానందము.—(ప్రస్థానము)

---

## దృశ్యము ౫. — అత్రిమున్యాశ్రమము.

---

(అత్రి నిద్రించుచుండగా, అనసూయ పాదములొత్తుచుండును.)

అన—(అను ౨౫)

భర్తగారికిప్పుడే నిద్దురపట్టినది. ఏకారణముననో నేడు ప్రాతఃకాలమునుండియు నా హృదయము భయకంపితమైయున్నది. ఉదయమున కోపదారియగు జడదారివచ్చి భూతనిర్మాణముఁగావించి, భగ్నమతియైపోయినప్పటినుండియు నన్ను పరీక్షింప నెవ్వరో రహస్యప్రయత్నములు చేయుచున్నట్లు నాకు పొడకట్టుచున్నది. నేటి యుదయముననేకదా నాథుఁడు "నిన్ను పరీక్షింపనీవేళ గడచినదా ?" యని పలికెను.

గీ. అవనిజనముల హృదయంబు లరయుకొఱకు
దేవతలు పలుమాఱు శోధించుచుందురి
తత్పరీక్షకునిల్చిన ధన్యమతులె
మానవులసంగఁబడుదు రీ మహితలమున॥

సర్వకష్టసంతతులకును పాశిశేశ్వరుఁడే కలఁడు. నితర పతిభక్తి తత్పరనగు నాకే యాపదలును రావు—

(పాదసేవ చేయుచుండును.)

భృంగి—(ప్రె) అదే యతిమహర్షి నిద్రాముద్రితుఁడైయున్నవాఁడు. నా కార్యమును సఫలీకృతముగా గావించుకొనుట కిదియే మంచి సమయము. ఈకృష్ణసర్పమును మెడలో వైచెదనుగాక—

[పామునఁనసూయమెడలో వయిచి ప్రస్థానము]

అన—[చూచి భయముతో] ఆహా! ఈకృష్ణసర్ప మెక్కడిది?—ఇదియంతయు నేదోమాయగానున్నది. ఇప్పుడు నేనేమాత్రి మల్లరిచేసినను నాథునకు నిద్రాభంగమగునుగదా! ఏమిచేయుదును—ఓపరమేశ్వరా! నన్నిపుడు రక్షించి నాథునకునిద్రాభంగముకలుగకుండ కాపాడుము.

[అను ౯౬] ఓదేవదేవా! నేను నిరంతరము పతిభక్తిఁబాయని దాననేని, యీకాలసర్పముం బూలమాలికగాఁ జేయుము.

(1 సర్పము పూలమాలికగా మారును)

అ—ఆహా! పరమేశ్వరుని కరుణాకటాక్షము. తన్నునమ్మిన వారి నాతఁడిట్లేకదా రక్షించుచుండును.

గీ. అంతరంగంబున స్మరించినంతలోన
భయదకాలసర్పము పూలమాలయయ్యె
కన్నతండ్రి విధంబునఁ గాచునట్టి
ఈశ్వరుని కరుణాసంబెన్నతరమె?

[పాదములు పట్టుచున్నది]

అ—(లేచి) జీవితేశ్వరీ! నీవింకను నిద్రింపలేదేమి?

అన—నాథా! ఇంకనెంతో రాత్రి కానందున పరమేశ్వరునికరుణారసమహాత్మ్యము నెన్నుకొనుచుఁ గూరుచుంటిని.

---

1 పూలదండలుగామారు పామును చూపవలెను.

అ—అర్ధరాత్రిము మీరియుండలేదా ? చోడు—ఇంక నెంతోగాత్రి కాలేదందువేమి? అదిగాక, నా దేవదేవుఁడు మన కెల్ల వేళల స్మరణీయుఁడే! నేఁడు ప్రత్యేకముగ నీ నిశివేళ స్మరించుట కేమి కారణము? అన్నట్టీ పూలదండ యెక్కడిది? నిన్నటి భగవన్నిర్మాల్య మైనఁ బర్ణశాలలో లేదే!—

అన—నాథా! నేటిచర్యను, నేనేమి చెప్పుదును?

సీ. ప్రాతస్సమయమందు భాగీరథీదేవి
కొలఁకఘుంబుల ధరఁగూల్చుటొకటి—
అటుపైన మిగుల నన్నాతురుండైనట్టి
జడదారిపై కోపపడుచు రెండు—
పుడమిఁబుట్టిన మహాభూతంబును క్షమించి
యాగ్రహంబులనుఁ జేరుమనుట మూఁడు—
ఎచ్చోటనుండియో వచ్చిన కాలాహి
యనుపమసుమహార మగుటనాల్గు—

గీ. నద్భుతంబేమియో యుదయంబునుండి
యిదుమలే కల్గినను పరమేశుకరుణ
నన్నియును శుభయోగ ఫలాంతములుగ
బరిణమించుచునున్నవో ప్రాణనాథ॥

అ—ఏమి! అట్లయిన నది పూలదండకాదా! కాలసర్పమా?

అన—సందేహమేమి? చూడుఁడు—

(అని మెడలోనుండి నేలపైనిడగా కాలసర్పమై ప్రాకిపోవుచున్నది.)

అ—శా. ఆనందాశ్రులురాలెకన్నుల; త్వదీయశ్లోకమాలింపఁగా
నానానేకమనుష్యసంఘములలోనన్ ధన్యతంగాంచితిన్
మానుల్గాంచని దివ్యశక్తిగలిగెం బ్రాణేశ్వరీ!యింతయా
నేనారీమణివైన నీకు సరిలేదీ రేడులోకంబులన్

అన—ఇదియంతయు దేవరవారిశక్తియే—

అత్రి—[అను ౨౭]

[తెరలో]

సతీ! అనసూయ! నేనాకాశవాణిని. ఈమాయ పార్వతి యాజ్ఞచే భృంగివలనఁ గావింపఁబడినది. దివ్యవీక్షణముగల మీరెరుంగని విషయము గలదే?—

[అనసూయాత్రులు, దివ్యదృష్టియందు సర్పమునిచ్చు, పార్వతిని, గైకొను భృంగిని చూచుచున్నారు]

ద్వి తీ యాం క ము

స మా ప్తం

విశ్రాంతి కాలము 10 నిమిషములు—

[విశ్రాంతి సంకేతమగు తెర వ్రాలును]



36

# సతీ అనసూయ

—♦ తృ తీ యా ౘ౽ మ్ ♦—

---

దృశ్యము—౧. ఇంద్రలోకము

ప్రి॥ ఇంద్రుఁడు, అగ్ని, యముఁడు, వరుణుఁడు

ఇం—అగ్నియమవరుణులారా!—మూఁడు లోకములందును, గాఢాంధకారము క్రిమ్ముకొనినది. కారణమేమోకదా!

అగ్ని—దేవా! గాఢాంధ కారణమేకాను. లోకంబెల్లచీకాకు నంది, గడగడ వడంకుచున్నది. ఇదియెట్టి ప్రళయకాలమో తెలియద య్యెను!

యము—అమరనాయకునిచించామణీభద్ర పీఠమునుఛత్రచా మరములును, బ్రిబలితములై భూపతితములుగా నుద్యమించు చున్నవి.

ఇం—ఓహో! భయంకరమగు నీజగత్సంక్షోభము వీక్షింప నలవి గాకుండనున్నది. దిక్పాలవరులారా! మనకిట్టి సమయముల నా పరాత్పరునిధ్యానముకన్న గత్యంతరము లేదు. కావునధ్యానింతము—

[అందఱు ధ్యానింతురు] [అను—౨౨]

నార—(ప్రి) దేవేంద్రా! భీతిల్లకుము—భీతిల్లకుము—

ఇంద్రు—ఓహో! త్రిలోక సంచారియగు నారద భగవానుఁ డు—బ్రహ్మమానసపుత్రా! నమస్కారము. ఈసంక్షోభమునకుఁ గారణమేమి?

నారద—దేవేంద్రా! ఆలకింపుము భూలోకమున "నర్మద" యను మహాపతివ్రతా తిలకముగలదు. ఆసతీమణి నిరంతర భర్తృసేవా వ్రతయు కుష్ఠురోగియు, నంధుఁడును నగు కౌశికుఁడను బ్రాహ్మణుని వివాహమాడియు, విసుగుఁగొనక—అసహ్యాపడక—మహాభక్తి సంపన్నయై, యాతని పాదతీర్థమే:ద్రావుచు దినంబుల బుచ్చుచుండును.

ఇం—ఆహాహా! వింటిరిగదా! దిక్పాలవరులారా! భూలోకమున నెట్టిమహాసాధ్వులుగలరో...ఇట్టివారి దివ్యచరిత్రముల విన్నంతనే మనము పవిత్రుల మగుదుముగదా !

యము—దేవా! అనంతర వృత్తాంతము నెఱింగింపుఁడు.

నార—అట్లు పతిసేవానుమోదయగు నర్మద భర్తఁగూడి తీర్థయాత్రల కరుగుచుండ మార్గమున మాండవ్యుఁడనుఋషిని కొందఱు చోరులు బాధింప తత్కాలమున కకడకుఁజేరిన కౌశికుఁడే తనబాధకుఁగారణమనితలంచి మాండవ్యుఁడాతని "ప్రాతఃకాలమైనంతనే మరణింతువు గాక" యని శపించెను.

ఇం—హా! హా! ఒకవేళ నాతఁడు మరణించెనా యేమి?—

నార—ఏమి!దేవేంద్రా? మరణించునా? భూలోక సతీమణుల నెంత తేలికగఁదలంచుచుంటివి? నర్మద సమీపముననుండగా నాపెం భర్తపై నీగవ్రాలఁగలదా ?

గీ. నిరతచలచిత్తయైన యిందిరనుఁ బోలె
బహుజనులనోటఁ బడినట్టి వాణిఁబోలె
ప్రకృతితామసయైన శర్వాణిఁబోలె
వారు దుష్టస్వభావలుగారు; మఘవ—

ఇం—నిజమునారదా ! నిజము— ఐన నా మహాపతివ్రత పతి మరణంబు నెట్లు తప్పించినది?—

నార—'ఉదయమే కాకుండుఁగాక'యని నర్మద సూర్యభగవానుని శాసించినది. ఆ కారణమున, ముల్లోకములకు నీయంధకారమును జగత్సంక్షోభముఁగలిగెను. ఇప్పుడు మీ యత్రిమహర్షి భార్యయగు ననసూయయను మహాసాధ్వినిఁ బ్రార్థించితురేని యామె మూలమున నీవిపత్తు తొలంగఁగలదు. అంతకన్న గత్యంతరములేదు.

ఇంద్రు—భాగ్యము. (అందఱు ప్రస్థా॥)

దృశ్యము-౨—కౌశికుని యిల్లు

కౌశి—ప్రి॥ నర్మదా! నర్మదా! అయ్యయ్యో—దీనియిల్లు వల్లకాడుగాను. నాప్రారబ్ధముకొలఁదియు నీభార్య నాకు సమకూడినది- ఈకుష్ఠురోగము నాశరీరమంతయుఁ గాల్చుకొని తిని వేయుచున్నది. బయటకుఁ బోవుదమనిన కన్నులుకనపడవు. నర్మదా! నర్మదా!

నర్మ—(జలముతో ప్రి॥)

నర్మ—ప్రాణేశ్వరా! దేవరవారి గాయములను శుభ్రముచేసి మందురాచి కట్లుకట్టుటకే నీరు కాచునిమిత్త మేగియుంటిని. క్షమింపుము- (అను ౨౯)

కౌశి—ఛీ! ఛీ-దుర్మార్గురాలా! నన్ను క్షమింపుమని యేమేమో యిచ్చకములు పలుకుచున్నావా! గంటసేపటినుండియు నన్నిచటఁగూర్చుండబెట్టి నీ వెవ్వరియొద్దనో నాటకము లాడుచున్న, నేను చత్తుననుకొంటివా, బ్రదుకుదు ననుకొంటివా? సిగ్గులేక నాయెదుట నింకను చకచట్లు చెప్పుచుంటివా? పొమ్మ-సిగ్గుమాలినతొత్తా-అవలబొమ్ము. నీవుపోయిన నీసవతి నింకొకదానిని పెండ్లాడెదను- (అను ౩౦)

నర్మ—నాథా! క్షమింపుఁడు- తప్పంతయు నాదే! ఇంక ముందెప్పుడు నిట్లొనరింపను. క్షమింపుఁడు-

కాశి—ఛీ? ఆకూతవదలుము. క్షమింపుమనగా వర్థమేమి ? పాడుపనులుచేయుచు క్షమింపుమందువా? భర్తనైన నాపైనీకు సుంతయిన గౌరవములేదే! నీవు నాతో కాపురమెట్లు చేయుదువు?-

నర్మ—నాథా! మీరే నాదైవము; మీరే నా ప్రపంచము; మిమ్ములనువదలి నేనేమైపోయెదను? నీరు కాచుట కాలస్యమైన మాట సత్యమే. ఐనను సాధ్యమైనంత త్వరలో కాచి తెచ్చియున్నాను తమపాదము లిటుల నాతొడపై నుంచుడు; చక్కగాకడిగి మందువేసెదను; అందువలన మీబాధ యొకింతుక యుపశమించును.

కాశి—నేనిచ్చట బాధతోఁ జచ్చిపోవుచుండగా "సాధ్యమైనంతత్వరలో" ననుమాట కర్థమున్నదా? ఔనులే-నీ కథయంతయు నాకు బోధపడుచున్నదిలే!-గ్రుడ్డివాఁడను, కుష్ఠువాఁడనునగు నావలన నేమి సౌఖ్యములభించునని నీతలంపు-నీవు క్రమముగా నేమిండగాని తోడనో లేచిపోఁదచినట్లున్నావే! కాని, జాగ్రత్త-ఈశరీరములో ప్రాణములుండగా నీమిండగానిని నిన్నును బ్రదుకనీయను. ఆటుతునుక లొక్కసారి భూమిపైఁ బడవలసినదే! తెలసినదా పౌరుషము-

నర్మ—హరిహరి! నాథా!-ఏటికీ నిష్ఠురములు-

కాశి—ఔను. నాతోడ కాపురము నీకెట్లు నిష్ఠురమైనదో-నా మాటలును, నీకట్లే నిష్ఠురములుగా నున్నవి-

నర్మ—నాథా! మొన్న మాండవ్యమహాముని మిమ్ములను తెల్లవారకుండ మృతినందునట్లు శపించినది మొదలు మీకెవ్వాడేకీడు గల్గునోయని, వేయిదేవతలకు మ్రొక్కుచుండగా మీకీ పలుకు లెందులకు ?

కాశి—ఓహో! ఔనౌను. మఱచితిని- నర్మదా !మాండవ్యుని శాపమేమైనది? ఇంకను తెల్లవాఱలేదుగదా!

నర్మ—లేదు; హృదయేశ్వరా! లేదు.

కౌశి—చూచుచుండును. జాగ్రత్తగాఁ జూచుచుండును. తెల్లవారినచో నా ప్రాణము లెగిరిపోవును.

నర్మ—నాథా! భీతిల్లకుఁడు! సూర్యభగవానుఁడెన్నఁడును సత్య మునతిక్రమింపఁడు! ఇప్పుడు కొంచెము తమ కుపశమనముగానున్నదని తలంచెదను.

కౌశి—బాధను! బాధను! చంపుచున్నావు! నీ యుపశమ నము చట్టుబండలుగాను నీకింత నిర్లక్ష్యమేమి? తిన్నగా తుడువలేవా!

నర్మ—నాథా! తిన్నగానే తుడుచుచున్నాను.

కౌశి—అబ్బబ్బబ్బబ్బ! ఓసి రాక్షసిముండ! నీ జవసత్వములు నమసిపోను. నీకెంతబలమున్నదే! (కొట్టుచున్నాఁడు.)

నర్మ—నాథా! క్షమింపుడు.

కౌశి—అదిగో! తిరిగి క్షమింపుమనుచున్నావా! తప్పుచేసినప్పు డెప్పుడును నేను క్షమించువాడనుగాను. దేవేంద్రుఁడు రానీ - నామతి మును మరల్పలేఁడు.

[దేవేం—అనసూయతో. ప్ర.]

దేవేం—అమ్మా! అనసూయాదేవి! మనమిప్పుడు కౌశికుని యిల్లుజేరితిమి. నీకరుణాలేశము వలననే యీ జగదుపద్రవ ముపశ మిల్లవలయును.

అన—దేవనాయకా! అల్లదే నర్మదా కౌశికులు! ఆమహా సాధ్వి నిప్పుడే ప్రార్థింతము.

(సమీపించుచున్నారు.)

నర్మ—నాథా! ఎవ్వరో యిటువచ్చుచున్నారు.

కౌశి—ఎవరయిననేమి? దేవేంద్రుడు వచ్చినను నాకునిమిత్తము లేదని చెప్పలేదా!

అన—అయ్యా! దేవేంద్రుఁడే వచ్చియున్నాఁడు.

నర్మ—ఆ! ఏమి మాభాగ్యము! దేవనాథులారా! అవ్యాజ కరుణారసమున మాగృహము పావనముచేసిన మీకందరికి నమస్కార శతములు!

దేవేం—అమ్మాయీ! చిరాయుష్మతివగుము— ఈ యన సూయాదేవింగొని మేము నీకడకుం గొండొక కార్యార్థము వచ్చితిమి! ఆలకించి మమ్మనుగ్రహింపుము.

అన—అమ్మా! నర్మదాదేవీ!

సీ. ఉవిదరో. నీనాథు నొకరుండు మరణించు
నట్టుల శపియించె నటగదమ్మ
భానుడే యుదయింపగానీక శాప మీ
విధితివంచును మాకు తెలిసెనమ్మ!
తరణియే యుదయమందని కారణంబున
భువనసంక్షోభంబు వొడమెనమ్మ!
సదమలంబైన నీసాధ్వీమహాత్మ్యమా
యత జగద్విశ్రాంతమయ్యెనమ్మ!
గీ. యీజగత్పతుల ననుగ్రహింపవేని
నిఖిలలోకంబు లేరీతినిలచునమ్మ!
కరుణ వెదజల్లి మావంక గాంచుమమ్మ!
పుడమి నీవంటి సాధ్వులు గలుగరమ్మ!

నర్మ—అమ్మా! అనసూయాదేవి! నీదర్శనమే నాకు సకల సౌభాగ్యముం గలిగించి యనసూయచరిత్రగా నొనరించె. అనన్యసులభులగు నీయింద్రాదిదేవతలును నన్ననుగ్రహించిరి. నాజన్మము ధన్యమయ్యె. మీరెంతగా నన్నుస్తుతించుటకుగాని జగత్క్షోభమునకు గాని

నేసికార్యము నొనరింపలేదు. నాప్రాణేశ్వరుని సంరక్షించుకొనుటకిట్లు గావించితిని. ఇప్పుడు నాకేది కర్తవ్య మది యానతిండు.

అన—అమ్మా! సూర్యోదయమగు నట్లానతిమ్ము. అదియే కావలసినది.

నర్మ—దేవీ! అనసూయా! సర్వవిషయముల నెఱింగిన నీవే యిట్లాడిన నామాంగల్యమునకు నీరువదలుకొనవలసినదేనా తల్లీ! నాజీవిత మేమికావలసినది?

అన—పతిభక్తియే నీకు ధర్మకవచము.

నర్మ—పతికొఱకేకదా నేను సూర్యునిరోధము సల్పితిని.

అన—ఉభయమంగళ ప్రదమగు మార్గము సర్వశ్రేయ మూలకమని తలంతును.

నర్మ—నిర్దోషియగు నాజీవితేశ్వరుని, మాండవ్యుఁ డెఱుగ లేనికతంబున, శపించెను. అనాలోచన శాపవాక్యములకు నాభర్తృజీవనములను బలియీయఁజాలను. నాకు లోకంబుతో నిమిత్తములేదు. జగన్మంగళము నాకక్కఱలేదు. ఇంద్రాదుల యానతిని, మీయుపదేశమును స్వీకరింపని మూఢనని మీరు దూషింతురుగాక! దానినైన సహింతును; కాని నానాథునిజీవములను హానిప్రదమగు నేకార్యమునైన నిరోధింతును. నాపతిసేవయే నాయందు దృఢవిశ్వాసమును నెలకొల్పి, నామాంగల్యమునకు సదా శ్రీరామ రక్షయగుచున్నది.

అన—తల్లీ! ఇఁక చాలును; నేనుమూఢురాలనై ఈ దేవతలు చూపిన మార్గమునవచ్చి యీ కోరరాని కోరికనుఁ గోరితిని: ఆవాచాదోషమునకు నాకు ఫలమగుఁగాక.

ఇంద్రు—అయ్యయ్యో! యమునాదులారా! ఈసతులిద్దఱు నేకమైరి; ఇఁకమనగతియేమి? సూర్యోదయము కానటులేనా! అనసూ

యాదేవి! నీవు అట్లు నర్మదను ప్రార్థింపవా?- అమ్మా! నర్మదా! నీ శాపము నుపసంహరింపవా?-

కౌశి—వలదు వలదు. మీరందఱును వచ్చి నాప్రాణములనుఁ దీయఁదలంచినట్లున్నదే! మీకేమి వెఱ్ఱియెత్తినదా! భూతముపట్టినదా? సూర్యోదయమైన వెంటనే నాప్రాణములు పోవునని యెఱింగియు,నింత వ్యయప్రయాసపడివచ్చితిరా! పొండు! పొండు!

నర్మ—నాథా! వీరందఱును పూజ్యులగు నింద్రాదిదేవతలు- ఈమె పూజ్యురాలగు ననసూయాసతి.

కౌశి—ఓ దౌర్భాగ్యురాలా! ఇంద్రుఁడువచ్చినను నేను లెక్కచేయనని చెప్పలేదటే మరల నదేపాటపాడెదవేమి?-

అన—అయ్యా! నీసతి పాతివ్రత్యమహిమచేత, నీప్రాణముల కేయాపదలు రావు. నీవు భీతిల్లవలదు.

కౌశి—ఏమోతల్లి ! నాప్రాణములు నాకుతీపిగాని, మీకేమి తీపి ?-

ఇంద్రు—నర్మదాదేవి! నన్ననుగ్రహింపుము.

అన—దేవనాథా! ఇట్టిప్రశ్న మీకున్యాయము కాదు.

ఇంద్రు—ఐన నీ లోకక్షోభము గల్పించుట నర్మదకు న్యాయమేనా!

అన—పతివ్రతయగు నీమెకింతకన్న న్యాయమింకొకటిలేదు.

ఇంద్రు—జగంబులు నశించినను సరియేనా?

అన—అటులేల కావలయును.

ఇంద్రు—ఏమగుచున్నది?

అన—కౌశికప్రాణదానము మీరొనర్తురేని యామె సూర్యోదయంబున కనుజ్ఞ యిచ్చును.

ఇంద్రు—అందునకు నీవే సమర్థురాలవనికదా నిన్నిందుఁదెచ్చితిమి!-

అన—నావద్ద నేమిసామర్థ్యమున్నది? నర్మదయే యన్నిటికిని సమర్థురాలగు సాధ్వీమతల్లి-

నర్మ—పూజ్యులారా! నాదృఢసంకల్ప మాలింపుడు.

ఆ॥ నాదుప్రాణనాధునకు మృతిఘటిల్లు?
భానువెలుగుమనుచు నేను బలుక
లోకవిలయమైన నాకనిమిత్తంబు-
సత్యమగుచు నిటులె జరుగుఁగాక !

—• సూర్యోదయ మగుచున్నది •—

ఇం—ధన్యోస్మి- ధన్యోస్మి- జగంబులకెల్ల పండువుగా నర్మదాదేవి యనుగ్రహమున సూర్యోదయమైనది.

కాశి—ఏమి? సూర్యోదయమైనదా?- సూర్యోదయమైనదా? హా! ప్రాణేశ్వరీ! నర్మదా? (జీవములు విడుచును)

నర్మ—హా! నాథా! నాథా! నన్నువిడచిపోవ నానేరమేమి?

(అను 3౧)

ఇం—సతీమతల్లీ ! నర్మదా ! దుఃఖింపకుము. అనసూయ సతీత్వప్రభావమున నీపతి పునర్జీవితుండగును.

సీ. ఎఱిఁగి యెఱింగి- దుస్తరకార్యమెంచి, యీ
పాపంబునకుఁ బాలు పడితిమమ్మ
యతితరాంచిత మహిమాన్విత పేటికి
నీప్రాణపతి మరణించునమ్మ?
బంధుర శుభపరంపరలంది, దీర్ఘసు
మంగలీత్వమునఁ జెలంగుమమ్మ

యీ సతి యదనూయయే నేడు నీ మనో
ధీశు జీవముఁ బ్రసాదించునమ్మ

గీ. సకలజగముల బాధలు సమయుకొఱకు
ధీరసాహస మొనరించినారమమ్మ—
మదిని నీపరితాపంబు మానుమమ్మ
యెల్లనరలోకమును క్షమియింపుమమ్మ—

నర్మ—పూజ్యులారా! నాసాధ్వీత్వ మిట్లు కానునేల ?—

( అను కే. )

అల—అమ్మా! నీసాధ్వీత్వమునకు లోపమేమియును లేదు. అమోఘవచనమగు నీయానతి వలనే సూర్యోదయమైనది.

నర్మ—నేనేమంటిని !

అన—నీవిప్పుడు"నాదు ప్రాణనాధునకు మృతిఘటియిల్లు ... భాను వెలుగుమంచు నేను బలుక— " అంటివి.

నర్మ—హా—హా—నేనే భర్తృప్రాణహారిణినా? ఐన నాజీవితములేల? నాధా నేనును మిమ్మనుసరింతును.

అన—నర్మదా! దుఃఖింపకుము. నీపతి యేల మరణించును.

(జలంబును దోసిటఁబట్టి)

గీ. ధవునియెడ భక్తిఁబాయని దాననేని
శాశ్వతంబైన లోకరక్షణముకొఱకు
పతితుఁడైయున్న నర్మదాభర్త మరల
నంధతనుఁబాసి జీవితుండగును గాత!

(చల్లును)

కాశి—[లేచి] ప్రాణేశ్వరీ! ఎచ్చటనున్నావు—

నర్మ—(కౌగిలించుకొని) నాథా—పూజ్యులగు దేవేంద్రాదుల యెదుటను సతీమతల్లియగు ననసూయాదేవి యెదుటను నున్నారము.

కౌశి—పూజ్యులారా! నాతప్పులు క్షమింపుడు. మీకివే నమస్కారములు.

అందఱు—చిరాయుష్మాన్భవ— (తిరోహితులగుదురు.)

నర్మ—ఆహా! దేవతలందఱు నంతర్థానమైరి; నాథా! నేడు మన కిది కలయా? నిక్కమా—

కౌశి—దేవి నర్మదా! కలయో నిక్కమోకాని, నాకంటికేదియో కనంబడుచున్నది; ఇది యంతయు ప్రపంచమా? నీవింతటియందముగ నుంటివా? ఓహోహో—ఏమినాభాగ్యము! ఏమినాభాగ్యము! ఇదినేను ప్రతిదినము పరుండు పటకుటీరమా! ఎంతచక్కగా నున్నది! నాకడుపులో నేమో యానందము పొంగిపొరలి పోవుచున్నది; ఏదీ ఒక్కముద్దు— (ముద్దిడుకొనును)

(అను. 33) (ప్రస్థానము)

తృతీయాంకము.

సంపూర్ణము.



# సతీ అనసూయ

## చతుర్థాంకమ్.



### దృశ్యము ౧

మన్మ — ప్ర॥ (అను 3ర)

ఈలోకంబులనెల్ల నా మాయాశక్తికివశముగావించి బొంగరము వలెద్రిప్పుచున్న నాకన్న వేఱుగా నెవ్వఁడో భగవంతుఁడు గలఁడని వేన వేలు దేవతలను మ్రొక్కు నీజనులెంత బుద్ధిలేనివారు ? దేవాలయములఁట — దేవతలఁట — ప్రార్థనలఁట — ఋషీశ్వరులఁట — తపములఁట — జపములఁట — నేనువారివంకకు కన్నెత్తిచూడనంతవఱకు గదా వారిశీలములు, వారిస్నానములు, వారి ధ్యానములు పనికివచ్చు — బ్రహ్మదేవుఁడు నాకుపకరణముగ సౌందర్యమును గల్పించి, దానిని కామినులందు నిర్మించి, లోకమెల్ల వనితా విముగ్ధమగునట్లు గావించి మద్వ్యాపారము నిరాటంకము జరుగుట కవకాశమును గల్పించినాఁడు. అర్ధనారీశ్వరుఁడగు నాశంకరుఁడు నన్నేమో భస్మమగునట్లు శపించె ననియు — నందువలన నామద మణఁగినదనియు — బుద్ధిలేనిమెట్టవేదాంతులు కొందఱు వాగుచున్నారఁట! — కానిమ్ము — ఒకవేళ నన్నాశంకరుఁడు భస్మమే చేసె ననుకొన్నను, అది నాకు మఱింత యనుకూలమయ్యెగదా! — అదృశ్యరూపంబున లోకంబుల చీకాకు నొందింప వీలు గలిగెఁగదా! —

సీ. విరహిణీజనులకు భీమస్వరూపమై
     చెఱకువిల్లంద మెడమచేత నమర
"జుమ్ముజు"మ్మనిమెయు తుమ్మెదగమి నారి
     యా వింటికోటికి నమరియుండ
సదమల సుమ పంచశర సమూహంబు ద
     క్షిణ హస్తమున బిగి దనరియుండ
చిలుకవజీరుఁ డంచిత వాహనంబయి
     భువనసంచార విస్ఫూర్తినొసఁగ
గీ. ఏమరక నెల్లయపుడు గులాములగుచు
  చైత్రుఁడును వసంతుఁడు ననుఁజేరియుండ
  జగములేలెదు మన్మథచక్రవర్తి
  నైన ననుఁబోలువారలీ యవనిఁగలరె?

నామహాత్మ్యము నెఱుఁగనివారందఱును నన్నుఁదెలియలేక తామిడుమల పాలగుచుందురు. ఐనను, ముల్లోకములందును నా సామర్థ్యము చవిఁజూడనివారెవ్వరు?

సీ. మున్ను దేహంబెల్ల కన్నులమయమైన
     శతమన్యుగతి నాదుశక్తిఁగాదె?—
కౌశికముని మేనకకు బానిసీఁడౌట
     నమదికంబైన నాశక్తిగాదె?—
పుత్రమిత్ర కళత్రములు రావణునితోడ
     సమయుట నా ఘనశక్తిఁగాదె?—
హరుఁడు మోహినిఁగాంచి, యాశించి, యవమాన
     యుక్తుఁడై చనుటనాశక్తిఁగాదె?—

గీ. గురుసతినిఁబొంది తారకేశ్వరుఁడు! షోడ
శ కళలనుఁగోలుపడుట నాశక్తిఁగాదె?—
నెమకి చూచిన మూఁడు లోకముల నెందు
మారుఁడను నన్నెఱుంగనివారు గలరె?

ఓహో!—ఏమిది?—ఆత్మకథా ప్రశంసంజిక్కి నేను ప్రకృతంబు నారయనైతిని. శీఘ్రముగ నేనులోకసంచారమునకరుగవలయు.

[పోఁబోవును]

[శీఘ్రగమనమున ప్ర. లక్ష్మీదేవి]

లక్ష్మి—కుమారా! మన్మధా! నీప్రయాణమెక్కడికి?—

మన్మ—అమ్మా! నమస్కారము. విరహిణీజనంబుల నేడ్పించుటయు, నూత్నావలోకిత యువతీపురుష సంఘంబుల హృదయంబుల మదీయ సుమశరంబులచేఁ దగులఁబెట్టుటయు, నొకచో నానందము నొకచో విచారముం గల్పించుటయు, స్వేచ్ఛగా లోకవిహారంబు సల్పుటయుఁ దక్క నాకేమి కార్యములున్నవి?—

లక్ష్మి—నేడు నీతో నొక కార్యము గలిగినదోయి—

మన్మ—అమ్మా! నావలనఁ గావలసిన కార్యములుగలవా? అట్లయిన సత్వరము వచింపుము. తీర్చెదను.

లక్ష్మి—అనసూయోదంతమును నీవువింటివికదా?

మన్మ—వసంతుఁడింతకుముం దామాటయే చెప్పుచుండెను. ఆమె మిమ్మవమానించినదఁట కాదా?—

లక్ష్మి—నాయనా! నీవు లెస్సగాగ్రహించితివి. ఆయనసూయ శీలభంగమొనరించి, నీతల్లినగు నాదుఃఖముఁ బోగొట్టుము.

[అను కని]

నీవీకార్యమున సత్వరమఁగిరమ్ము—

మన్మ—ఇట్టి కార్యములు నాకు మంచినీళ్ళప్రాయములుగదా! నా మిత్రులగు చైత్రవసంతుల నిప్పుడే వెంటఁగొని చని, నీవు మెచ్చునట్లా యనసూయ నపవిత్ర యనిపించి వచ్చెదను.

[అను 3ε.] [ప్రస్థానము)

లక్ష్మి—ఈసారి తప్పకుండ నాయనసూయ మదమణంగక పోదు. అప్పుడు నారదుని బాగుగా పరిహసింపవచ్చును.

నార—అదిగో! లక్ష్మీదేవిగారు నాపేరెత్తుచున్నారు— ఇంకను అనసూయ కథాఘట్టమునందే తలక్రిందు లగుచున్నారని తలంచెదను.

లక్ష్మి—అదిగో! నారదా! మాటలోనేవచ్చితివి! తలంచినప్పుడే ప్రత్యక్షమగుచుందువు. సరేగాని—నేనిప్పుడా యనసూయ గర్వభంగముసేయుట కెంతచక్కని మార్గముఁ గనిపెట్టితినో వింటివా?—

నార—అమ్మా! వినవలసినదిలేదు. వెనుకటిమార్గము లన్నియు నపమార్గములగుట కన్నులారఁ జూచియు నీనూతన మార్గమునుఁ జూడ నవసరముండదు. ఐనను, నీవంతయాత్రముతోఁ జెప్పుచుండఁగా వలదనఁగూడదు. ఏదియేది యా నూతనమార్గము!—

లక్ష్మి—నాకుమారుఁడైన మన్మథునిప్పుడే తగుపరివారముతో నా యనసూయపై కంపియున్నాను. ఆమె హృదయమున నెట్టులైన మోహబీజముల నంకురింపఁ జేసి, యపవిత్రురాలిం జేయవలయునని యాజ్ఞాపించితిని. ఇందులకు నీవేమందువు?—

నార—అమ్మా! ఏమందును?— మీకంత తెలివితక్కువతన మేటికందును—అనసూయ సాధ్వియందును—ఈప్రయత్నముమానుమందును—మిమ్ముల మనుమందును— [అను 3౭)

లక్ష్మి—నారదా! వెనుకజరిగిన వన్నియు స్థిరమైన ప్రియత్న ములు కానందువలన నట్లు భగ్నములైనవి; కాని, యీసారిమాప్రయత్నము విఫలము కాదు.

నార—అమ్మా! వెనుకటిప్రియత్నములు స్థిరమైనవికావా?

సీ. భాగీరథీదేవిపాపసంతతుల భ
స్మీభూతమగుట వీక్షించినారు;
భృంగిని కూటికంపించి, భూతమునుఁ గ
ల్పించి, గోడుటను వీక్షించినారు;
శంభు కంఠాభరణంబుచేతను బెద
రించి—యోడుటనువీక్షించినారు;
నిర్మలమతియైన నర్మదాప్రాణేశు
జీవదానమును వీక్షించినారు

గీ. ఏవి సుస్థిర యత్నముల్ గావు తల్లి?
కంతుఁడివు డవమానంబుఁ గాంచుసమ్మ
సతిని శోధించు టేకనైనఁ జాలదమ్మ
యేటికీ పనిలేని యారాటమమ్మ.

లక్ష్మి—నారదా! ఏమంటివి? మన్మథుఁడు విజయమందడనియే పలికెదవా? ఔను. బ్రహ్మచారివి గావున మదనునిమహిమ నెఱుంగక మాటాడితివి. కావున తప్పులేదు.

నార—ఆమదనునిశక్తి యనసూయకడ చెల్లదనినానమ్మకము. కావున నీపని మానుము.

లక్ష్మి—నారదా! నాకుఁగల్గిన యవమానమునుఁ దీర్చుకొనవలసినదనియే చెప్పెదవా?

నార—అమ్మా? నేనట్లు చెప్పఁగునా? కాని-

సీ. ఔచిత్యమెఱుఁగక యసమానమైన ప్రా
ణేశువక్షస్థలం బెక్కునాఁడు-
సిరులిచ్చు నెపమున మఱియాదఁబోనాడి
పంచపంచల సంచరించునాఁడు-
అరకాల సత్యభామాకృతి పూజ్యుఁడౌ
దైతుమూర్ధంబునఁ దన్నునాఁడు-
మాన్యుఁడౌనల కర్దమప్రజాపతికయి
గుంటగుంటలనీరుఁ గ్రోలునాఁడు-
గీ. నీదు గౌరవమెఱుఁగవో, నింద్యమనుచుఁ
దలఁపవో, యెపుడింత పంతంబులేదో?-
సాధ్వి యనసూయఁగని పూజసల్పకిట్టు
లీర్ష్య వహింతువమ్మ! లక్ష్మీలలామ!-

లక్ష్మి—నారదా ! నీకు బదులు చెప్పవారెవ్వరు? ఒకమాటకు పది యుత్తరములొసఁగు దుస్స్వభావము గలవాఁడవు. కానిమ్ము; అనసూయాపరాభవము వీక్షించెదవుగాక!-

(అందఱు ప్రస్థానము)

దృశ్యము—౨. అత్రిమున్యాశ్రమప్రాంతము.

మన్మ—ప్ర॥ [స్వ] ఆయనసూయ యిప్పుడే యీవనముం బ్రవేశింపగలదు. నేనింక నాసామర్థ్యముఁ జూపవలయును.

సీ. చైత్రుఁడా! మదిలోన చెలియింపఁబోకుమా !
యనసూయ దృఢచిత్త యనుచువింటి
సంసిద్ధముగ నో వసంతుఁడా! నిలువుమీ.
నేడనసూయపై దాడివెడల
భ్రమరంబులార! సంభ్రమ మందఁబోకుఁడీ-
యనసూయపైకి మీరఁదగవలయు

కుసుమబాణములారా! విసవునందకుఁడింక
ఘనరణంబివ్వుడు గలదుమీకు-

గీ. రాచిలుకవాహనంబ! పరాకు నీకు-
మలయమారుతమా! తీవ్రగతివిగమ్ము-
చందమామ! నాకీనాడు సాయమగుము-
వినుఁడు; మీమీపనులమీద వేగఁబొండు-

[చాటున దాగును]

అన—[స్వ] నాథుఁడు తపోవనమునకేగి యెన్నియో దినములైనది. ఇంకను రాడయ్యెను- ఆయనపాదుకలైన బూజించుకొనుటకు పుష్పంబులఁ గొనిచనియెద. ఆహా! ఈవనమునేడెంత చిత్రముగ న్నది. ఎన్నఁడును లేని యీపుష్పములన్నియు వికసించి యెంత కన్నుల పండువ చేయుచున్నవి!

(అను ౩౭)

మన్మ—(స్వ) ఈతరుణికి మరులుగొల్పు సమయమిదియే! ఓ వకుళ చూతమల్లికారవింద కేతకీపుష్పములారా! సిద్ధముగనుండుఁడు-

(విల్లుసవరించును,)

అన—ఏమిది?నామనంబున రాగాంకురమగుచున్నది!

(అను ౩౮)

మన్మ—[బాణము వదలును.]
అన— [అను ౪౦]

ఆహా! నాశరీరమంతయు నాకువశముగాని యున్మత్తావస్థకులోనగుచున్నదే! పాదములొకచో నిలువక తడబడుచున్నవి. గుండెలతి వేగముగఁ గొట్టుకొనుచున్నవి. ఈవకుళవనమును నేనిదివఱ కెన్నడు జూడలేదు. ఓమన్మథభగవానుఁడా! నీకు జోహారు- ములుకులంబోని నీశరంబుల నన్ను బాధింపకుము.

మన్మ—[బాణము వదలును]

అన— (అను ౪౧)

హా! హా! చిత్రము:-వకుళవనమెంతలో చూతవనమైనది. నే నేమి మేల్కనియుంటినా, నిద్రించుచుంటినా?- నాకనుల యెదుటనే యిన్నిచిత్రములు జరగుచున్నవే, ఓహో! ఈసథము లెక్కడివి?- ఇందలివారలు దేవతలు కాంబోలును, వీరందఱు నెక్కడికిం బోవుచున్నారో!- ఇదియొకవేళ దేవతాప్రదేశముకాదుగద. ఓమన్మథా! నీకు జోహారు, నన్నురక్షింపుము.

మన్మ—[బాణము వదలును]

అన— (అను ౪౨)

ఓహో! ఈమల్లికావనమెంత యాహ్లాదకరముగ నున్నది కమ్మని తెమ్మరలుం నాఘ్రాణేంద్రియమును వివశత్వమున ముంచుచున్నవి.

ఈమల్లెపొదలపై కృష్ణసర్పము లెట్లు నటియించుచున్నవో! ఏమి యీతాపము! ఏమియీవేదన. ఓమదనా! నన్ను రక్షింపుము అనాథను రక్షింపుము-

మన్మ:—(బాణము వదలును)

అన— (అను ౪౩)

విమలజల సంపూరిత భాసమానమగు నీసరోవరంబును, సరోవరాంతర్గత విలాసవిక్రీడితానంద వీచికాడోలితములగు నీరాయంచలును రాయంచగమిచే నాహరింపంబడు శీలలమృదు మృణాళసమూహంబులును, మృణాలసమూహ సమాక్రాంతమగు పరిమళమిళిత

---

♦ మన్మథుండొక్కొక్కబాణమువిడువ రంగస్థలమొక్కొక్కరీతిగా మారుచుండవలెను.

పద్మసహస్రంబులును, సహస్రభ్రమర సమాస్వాదిత మధురంబగు మకరందంబును, నాహృదయంబున మోహరసంబును పెల్లుగా నుల్లసిలఁ జేయుచున్నది. హా! మన్మథా! రక్షింపుము. రక్షింపుము.

మన్మ—[బాణము వదలును]

అన—— [అను రర]

ఆహా! ఈకేతకీవనము ప్రకృతిరమణీయ మయ్యును, నాకెంత తాపకారణమైనది. ఆపరిసరమునగల సరోవరమున నెవ్వరో స్నానమాడుచున్నారు. [చూచి] ఆహా! నాకన్నులకు నేఁటి ప్రదర్శనము గాన్పించినది. వీరెవ్వరో యన్యోన్యతగల దంపతులు. గాఢాలింగనముఁగావించుకొని మజ్జనంబాడుచున్నారు. [ఇంకొకవంక దిరిగి) ఇస్సీ పరమేశ్వరా-నాకు నేఁడీవిషమైన రంగస్థలముం జూపుచుంటివా! ఈ దంపతులెవ్వరో చుంబనసౌఖ్యము ననుభవించుచు, నొడలు మరచి భుజంగములవలెఁ బడియున్నారు. నాకెన్నఁడునులేని యారాటముగ గ్లుచు హృదయమునఁ బోరాట ముత్పన్నమైనది. హా! మన్మథా! రక్షింపుము-రక్షింపుము.

మన్మ—(బాణము వదలును)

అన:—హా! ప్రాణేశ్వరా! (మూర్ఛిల్లును)

మన్మ:—ఆదేశమయ్యెను. ఈసతికి భర్తపై గాఢానురాగము కలిగినది. నేనిప్పుడే యత్రిమహర్షి యాకారముం దాల్చి వచ్చి యీయామె మానభంగముం గావించెదను. (ప్రస్థానము]

అన:-(లేచి) అయ్యయ్యో! నేనింత వెర్రిదాననైతి నేమి? తపోవనంబున కరిగి ప్రాణేశ్వరునకై చేసినంత వగలంబొగలఁదగునా? నా హృదయము నేఁటిలు వివశీకృతమైయున్నది. ఈ పండువెన్నెలయు సుఖతరమయియున్నది. ఈ మలయానిలసౌరభంబును, నిండార బూచిన యీ పూపొదరిండ్లను, ఝంఝుమ్మని రొదసేయు నీతుమ్మెదలును,

కో యని యెలమావిగున్నలంగూయునీకోయిలలును, నామదన తాపం బు నినుమడింపజేయుచున్నవిగదా! ఈమన్మధుండొక యెడ పూవు బాణంబుల జురుకుచురుక్కున నాయెడద గాఢంబుగ నాటనేయుచు న్నవాఁడు- ఆహా! నేడునామదికిది మరణవేదనగా గాన్పించుచున్నదే!

సీ. చలిగాలియనుపేర బలునిప్పులను దూరు
పారబోయగజొచ్చె పవనమూర్తి
చల్లనికిరణంపు బల్లెంబులను గ్రుచ్చి
సమయింపగాజొచ్చె చందమామ
కుసుమవాసనపేరి విసపుగాలులఁజిమ్మి
పొలియింపగాజొచ్చె పుష్పలతలు
సారె సారెకు కూసి శ్రవణరంధ్రంబుల
బెకలించె నీశుకపిక చయంబు

గీ. అవనివిభుండు విమతసంహారుఁడగుచు
సారెకును మోహమంత్రంబు జదువసాగె
దారుణముగ వసంతుఁడు దాడివెడలె
హా! యెటులు సహింతును మన్మథాద్యవస్థ.

ఓ వనదేవతలారా! వసంతచైత్రమన్మథులారా! నానాథుని నాకుఁగూర్చుఁడు. (మూర్ఛిల్లును]

మన్మ—(అత్రిఆకృతితో ప్ర॥)

అన—ఏమిది!—ప్రాణేశ్వరుఁడు దర్శనమొసంగెను. నాథా! తమరేగిన కార్యమేమయ్యెను? ఇంతలో నాయెదుట సాక్షాత్కరించితి రేమి? ఏమి నాభాగ్యము!

మన్మ—సాధ్వీమణీ! నీవు మన్మథపరితాప వివశవయి పరితపించుటను యోగదృష్టినెఱింగి తపంబులనుజాలించి నిన్నలరింపవచ్చితిని. నీగాఢాలింగనసౌఖ్యము నొసంగి నాయాశ్లేషము నందుము.

[అను రాగి]

అన:—(తనలో) ఏమీయాశ్చర్యము! నానాథునియందు లే లక్షణములు గాన్పించుచున్నవి.

చ. స్థిరమతి, దైవయోగమునజిక్కి- మహేశ్వర పాదపద్మముల్
నిరతమునమ్మి యైహికము నింద్యమునైన సుఖంబుఁ రోయు, స
చ్చరితుడు నాదుభర్త విలసత్తపమున్విడనాడియీగతిం
బరువిడి వచ్చుటెంతయు, గవంగ మనంబున జిత్రమయ్యెడిన్.

మన్మ:—ప్రాణేశ్వరీ! మాటాడవేమి?

సీ. ఈమన్మథ దవాగ్ని యేరీతిఁజల్లారు
గురువాక్సుధాధార గురియవేని
ఘనపుష్పశరభుజంగములెట్లు సమయు, నీ
ప్రేమమంత్రముల వారింపవేని
మోహాంధకార జీమూతమెట్లుదొలంగు
వెలది! పయ్యెదగాలి విసరవేని
చెఱకువింటివిషంబు భరియింపబడుటెట్లు
నీ యధరామృతం బీయవేని

గీ. నారి యీస్మరదాహ మేతీరువాయు
ముదిత నీప్రేమరసమున మునుగకున్న
నీతనువునందు నాజీవ మెటుల నిలచు
తోయజాక్షిరో! యౌషధమీయకున్న

అన:—(అనసూయతో) ఛీ! ఛీ! ఎట్టి నీచవాక్యములను వినవల సివచ్చెను. ఎన్నడు నిట్టిపలుకులను నా హృదయేశ్వరునినోట వినియుం డనే! వీడెవ్వఁడో నీచాతి నీచుండైన దుర్మార్గుఁడు నానాథుని రూపం బునవచ్చి నన్ను మోసగింపఁదలంచె నిదినిశ్చయము. కంఠస్వరమును

ఖేదముగానున్నది. [ప్రికా] ఓపాపాత్ముఁడా! నీవెవ్వఁడవో తెలుపుము! లేనిచో నీపాపఫలంబు ననుభవింపగలవు.

(అను ర్గ)

మన్మ:-చెలీ! ఇట్లు మాటాడెదవేమి? నేను ప్రాణేశ్వరుఁడనగు నత్రినిగానా? నన్నిట్లాడదగునా! లలనా!నిన్నువీడి చిరకాలమైనందున మదనతాపము భరింపలేక నిష్ఠుః తపముననను వదలివచ్చితిని. నన్ను కరుణింపుము.

గీ. యోగమునఁజిక్కి దీర్ఘవియోగబాధ
వాడి సగమైన నాతనువల్లి మరల
నీదు కరుణారసంబున నిలువవలయు
నీసమాశ్లేష సుఖమిమ్ము నీరజాక్షి.

అన—(తనలో) ఈదుర్మార్గుఁడింకను తనదుర్వాదమునుమాన కున్నవాఁడు. నేనాలసించిన ప్రమాదము రాగలదు. కావున శీఘ్రము గాచేయదగినపని జేయవలయును (చేతులుమోడ్చి) ఓదేవదేవా! ఆపన్నజనసంరక్షణా!

సీ. మందాకినీదేవి మానంబుగాపాడి,
కర్తిచే మాట దక్కించినావు
భూతనిర్మాతయౌ మునినాథు గర్వభం
గముజేసి యానాడు గాచినావు
పైబడ్డ గాలసర్పంబు హారంబుగా
బరికింపజేసి కాపాడినావు
నర్మదా ప్రాణేశు నాచేతజీవింప
జేసి లోకములు రక్షించినావు
గీ. ప్రాణనాథుని మాయరూపంబుతోడ
వీడెవడో నేడు వచ్చియున్నాడు దేవ!

ఈ విపత్తును గడుప నాకెవరుదిక్కు-
బంధుఁడవు నీవ కావ గోపాలదేవ!

ఓదేవా!—నేను నిష్కళంకపు పతివ్రతనేని యీపాపి నిజాకృతిం బొందునట్లు దయచేయుము [జలము చల్లగా అత్రి మన్మథుడగును]

మన్మ—(అనసూయ పాదములపైఁబడి) సతీ అనసూయా! రక్షింపుము. రక్షింపుము. (అను ౪౭)

అన—ఛీ! దురాత్ముఁడా! నిన్ను క్షమింపవచ్చునా? ప్రపంచములన్నియు నీవలన కళంకములై భరింపరాని పాపంబునకాకరంబులై దుర్గతుల నొందుచున్నవి. నీకన్న నధమాధములు కలుగుదురటరా? రజోగుణప్రధానుండవగు నీకతమున నెందరుపతివ్రతామతల్లులు కులటలైరో లెక్కింపనలవిగాదుగదా! మదనా! దుర్గుణసదనా! నిన్నింక క్షమింపఁగూడదు. నీపంచశరంబులు పటాపంచలై నీవు మఱియొకమారు భస్మమగునట్లు శపించినను నీపాపంబుతీరదు.

( అను ౪౮ )

నిన్ను భస్మమగునట్లు శంకరుఁడు శపించిన ననంగుఁడవై సంచరించుచున్నావు. నిన్నిట్లింక శపించిన లాభములేదు.

గీ. పొగరుదీపింపఁ గన్నుల పొరలు గ్రమ్మి
మంచిచెడ్డల నెద విచారించకుండ
పాంథులను దుఃఖపెట్టిన పాపఫలము
కనులు లేకుండ నిన్నుఁ జేయుఁగాక! మదన!—

మన్మ—హా! పరమేశ్వరా! [మూర్ఛిల్లును]
అన—ఆహా! ఇట్లేకదా దుర్మార్గులగువారు పడుపాట్లు!—

(అను ౪౯)

మన్మ—(లేచి) ఆహా! ఏమిది! నాకన్నులు కనంబడుటలేదు. తల్లీ! అనసూయాదేవీ! నీవు నాకెచ్చటనుఁ గాన్పించుటలేదేమి?—

ప్రపంచమంతయు నంధకారబంధురమై యున్నది. నాకేది దారి ?— మహాపరాధినై నీ మహాత్మ్య మెఱుంగక నిన్ను పరిభవింపవచ్చి నేను పరాభవము పాలయితిని. అతిదారుణమయిన నీశాపకారణమున నా కన్నులు పోయినవి ! నిన్ను తప్పుగాదలంచిన నాపాపమే యీశాపముగా బరిణమించినది! సాధ్వీమతల్లివగు నీకు దీర్ఘక్రోధముచితమయినది గాదు. రక్షింపుము. నీ శాపము నుపసంహరించి రక్షింపుము. ననుఁదరి జేర్పుము.

చ, తెలిసె భవన్మహామహిమ తెల్లముగా మహితోజ్జ్వలాంగి, నీ
యలఘుపతివ్రతామహిమ కంబుజనాభ ముఖాది దేవనా
థులు నిలువంగజాలుదురె? దుర్మతినైనను గావుమెన్నడున్
సలుపగ సాహసింపను, భుజంగకరాళముతోడ క్రీడలన్॥

అన—మదనా ! విషరదనా ! పాపాత్ముడవగు నిన్నుక్షమింపరాదు—అయినను—

సీ. శ్రీనాధునకును లక్ష్మీదేవికిని, ప్రియ
పుత్రకుండవుఁగాగ బుట్టినావు—
హరునిగోపాగ్నిలో నణగియునీసతి
భాగ్యమూలంబున బ్రతికినావు—
ముల్లోకముల జగన్మోహనాకార, స
న్మూర్తివనెడుకీర్తిఁ బొందినావు—
అఖిలలోకంబు నఱచేతిబొంగరం
బులరీతినాడింపఁ గలిగినావు—
అట్టి నీవు నాకు శరణమగుటకన్న
కావలయు కార్యమిక నేమిగలదు మదన
దివ్యవీక్షణమునుఁ బ్రసాదించినాను
చనుము? సాధ్వుల తెరవు బోజనదు వినుము ॥

[ప్రస్థానము]

మన్మ—ఆహా! కన్నులు వెండియుఁ గాన్పింపజొచ్చినవి! ఈ మహాసాధ్వి మహాత్మ్యమెంతయని చెప్పుదును? నిగ్రహానుగ్రహ సమర్థురాలగు నీమె కీరేడుజగంబుల నే బోటులుఁ సాటియగుదురు— ఆహా! మాయమ్మ మాటలువిని, నేనెంత మోసపోయితిని. ఆడువారి యాలోచనలను విశ్వసించి యేకార్యమునందును దిగరాదుగదా!

సీ. ఉత్తానపాదుఁ డత్యుత్తముధ్రువుఁబాసె
వనితల దుర్బోధ వినుటచేత—
దశరథేశుఁడు కాలధర్మంబునొందెను
వనితల! దుర్బోధ వినుటచేత—
సుతులతో రావణాసురుఁడు భూస్థలిగూలె
వనితల దుర్బోధ వినుటచేత—
రుక్మాంగదుఁడు పుత్రునిజంప బాల్పడె
వనితల దుర్బోధ వినుటచేత—

ఆడువారి హితంబుల నాలకించి
ధన్యులగు వారలరుదుగదా! ధరిత్రి
నేను దుస్థితిజెందితి; నెవ్వరైన
నెలతల హితంబులను విన వలదు వలదు॥

[అను గిం] [ప్రస్థానము]

చ తు ర్థా ం క ము

స ం పూ ర్ణ ము.



# సతీ అనసూయ



పంచమాంకమ్



దృశ్యము ౧

(ఒక మాలది బిడ్డలతో ప్రవేశము)

మాల—[అను ౫౧] బిడ్డలారా! రండి—మీకాఁకలి వేళయ యినది. దేవుఁడు మనకు నేడు గలిగించిన దుస్థితి యిది! ఏనాడుమున మెవ్వరి నోటిముందరి యన్నముందీసివేసితిమో నేడీ ప్రాప్తముం గంటిమి!

బిడ్డలు—అమ్మా! ఆకలే! (ఏడ్చుచున్నారు)

మాల—బిడ్డలారా! కొంచెమోపిక పట్టుడు. ఈప్రక్క నేదో కుటీరమున్నది. మనుష్యులున్నట్లున్నారు! మనకేమయిన నన్నము దొఱుకునేమో—(సమీపించుచున్నది.)

అన—(ప్రవేశించి) ఈప్రాంతమునభోజనాశచే, నాక్రందించు పసిబిడ్డల సవ్వడి వినంబడియె; ఆహా! పసిబిడ్డలనిన నా మొగమూరక్కే వాచినట్లగునుగదా!—ఏమిచేయుదును? ఛీ! లోకమున, బిడ్డలులేని వారి జన్మమొక జన్మమా?

సీ. కడుపార పదినెలల్లని, మోసి, పెంచి, డో
లికనూఁచి చన్నుబాలిచ్చునపుడు—

పారాడుచును దన పాదంబులంబడి
"యమ్మా" యనుచు మొగం బరయునపుడు—
నిరుగింట పొరుగింట, దిరిగి వేళకురాక
వేమారు మారాము బెట్టునపుడు—
విద్యలునేర్చి వివేకంబుతోఁ దన
కడనిల్చిమాటాడ గల్గునపుడు—

గీ. తల్లిదండ్రుల కాత్మ నందనులపైన
గలుగు ప్రేమంబునకు నెంత విలువగలదొ?
తలపనొడలెల్ల పులకలు గలిగెనకట!
సంతతియె లేని మనుజుల జన్మమేల?

మాల—బిడ్డలారా! తనలో నేమేమియో మాటలాడుకొనుచు నొక విప్రాంగన యిటేవచ్చుచున్నది. ఈమెను ప్రార్థించి మీకన్నము పెట్టించెదను రండు—[ప్రికా.] అమ్మా! నీవు మంచిదానవుగానున్నావు! నాపిల్లలకు నిన్నటినుండి తిండిలేదు. ఒక్క కబళముం బెట్టి పుణ్యముం గట్టుకొమ్మ.

అన—(తనలో) ఆహా! నల్లగానున్నను ఈపిల్లలెంత యందముగా నున్నారు!—

గీ. నిండుచందురు హసియించు నెమ్మొగంబు
లాకలి కతాన వాడియు నతిముదంబు
గలుగఁజేసెడు నామనోజలజమందు
పుత్రులేలేని కొఱతఁ గాఁబోలునిపుడు॥

ఈపిల్లల నొకసారి ముద్దు పెట్టుకొందునా?—

[దగ్గఱకుఁ బోవుచున్నది

మాల—అమ్మా! నీవు బాపనివారి పడుచువలెనున్నావు! మేముమాలవాళ్లము. దగ్గఱకు రాకమ్మా!—

అన—హా! హతాశనయితిని. [ప్రికా] రానుగాని—నీపిల్లల కేమి కావలయును. నీవిచ్చటి కేలవచ్చితివి?—

మాల—అమ్మా! ఈపిల్లలతండ్రి చచ్చి నెలరోజులయినది! కూటికి లేక—మాడిపోవుచున్నాము. ఎన్నిచోట్లు తిరిగినను నేను పిడికెడు మెతుకులు దొరకలేదు. నిన్నుఁజూడగా చల్లని తల్లివలెనున్నావు! కొంచెమన్నముఁబెట్టి యీ పిల్లల సాదమాన్పుము.

అన—అమ్మా అంతకన్న నాకుఁగావలసినదేమి? నీవేజాతిదానవైననుసరే! అతిథులంబూజించుటయేగృహస్థధర్మము. నేనుదానినాచరింపక తప్పదు. ఒకక్షణమిందు నిలువుము. నీకన్నముందెచ్చిపెట్టెదను.

(ప్రస్థానము)

మాల—బిడ్డలారా! మనమేనాడెవ్వరికొరక పిడికెడన్నముంబెట్టించితిమో నేడది యక్కఱకువచ్చినది. మీరు దుఃఖింపకుడు. ఆయిల్లాలిప్పుడే మనకన్నముఁ బెట్టును.

అన—(అన్నముతో ప్ర) అమ్మా! ఇదిగో ఫలసంయుతమయిన భోజనము.

మాల—మాతల్లి మాతల్లి—నీకు వేయేండ్లు గలుగుఁ గాక! నీకు మూడుతలకాయల కొడుకుగలుగుఁగాక!—

(బిడ్డలకన్నముఁ బెట్టుచున్నది.)

అన (తనలో) అకటా! నాకంతటి పాత్రమా?

ఆ. సతతము మొగమువాచి, సంతానమోయని
యేడ్చువారికొసఁగ డీశ్వరుండు
నిలువనీడలేని నిరుపేదవారికి
కరువుదీర సుతులు గలుగుచుండ్రు॥

ఆహా! ఒక్కపుత్రునిఁగని పెంచి ముద్దిడి యాలింగనముఁజేసి యానం దించు మహాభాగ్యము నాకెన్నటికోగదా!

సీ. సుతుని జోలికనుంచి. "జో! జో!" యనుచు, జోల
పాటలు ముద్దుగాఁ బాడు టెపుడొ?
ముంగురులను దువ్వి మోమునఁగస్తురి
బెట్టి చెక్కిలి ముద్దుబెట్టు టెపుడొ?
పాలతోఁగలిపి నీవారంపుటన్నంబు
ప్రేమతోడుత దినిపించు టెపుడొ?
"రార నాముద్దు పుత్రక! రార" యంచు నా
ప్రేమంబుదీరఁగాఁ బిలుచు టెపుడొ?

గీ. సాటి సత్పుత్రవతులతో సమయగాగ
చంక సుతునిడి, యటు నిటు గనుట యెపుడొ?
పరమనిర్భాగ్యనగు నాకు బాలకుని, వి
శేష కృప నీశ్వరుఁడు దయసేయు టెపుడొ?

మాల—అమ్మా! నీకు భగవంతుఁడు సుపుత్రులను గలిగించును. నీకు సత్సంతానము గలుగుగాక—మాకింక సెలవిమ్మా—బిడ్డలారా! రండి

(ప్రస్థానము.]

అన—ఏమిచెపుదునా యిది! నేను సుపుత్రులకయి మనంబునఁ దలపోయుచుండ నీమాలెత యిట్లుదీవించిచనినది!— ఎవరినోట నెట్టి సత్యముగలదో తెలియదుగదా! ఈబాలురనుఁజూచినది మొదలునాహృదయము పుత్రులపైఁజనినది- నానాధు నెట్లైన బ్రార్థించి బదరికా

వనమునకేగి పుత్రులకొఱకు శ్రీమహావిష్ణుంగూర్చి తపంబాచరింపఁ బంపెవను. భర్తవరదుండగు నాజగన్నాథుఁడనుగ్రహింపకపోఁడు.

(ప్రస్థానము)

దృశ్యము ౨—బదరికావనము

(తపముచేయుచు నత్రిముని కనఁబడుచున్నాఁడు.)

అత్రి— (అను గీ౨)

ఓజగద్రక్షకా! భక్తత్రాణపరాయణా! నారాయణా! కరుణింపుము.

చ. కమలదళాక్ష! యీబదరికావనమందు, సమాధిఁదాల్చి నీ
మమున జలాగ్నిమధ్యతల మార్గములంబవనాశనుండనై
కొమరుగల్గు సద్వరముఁ గోరితి నింక ననుగ్రహింపవే!
యమలినమైన నీదుచరణాంబుజమే శరణంబు మాధవా!

ఓకమలామనోహరా! ప్రణతార్తిహరా! మురహరా! అనంతకల్యాణ స్వరూపుండవై యాదిమధ్యాంతరహితుండవై— వాచామగోచరుండవై-భవమహాంధకార సహస్రమయూఖుండవై- గంభీరశ్యామలకోమలాంగుడవై-సంకల్పమాత్రసృష్టిస్థితిలయ కారణ కారణుండవై-సమస్త జగదంతర్యామివగు పరబ్రహ్మమైయలరు నీదివ్యస్వరూపంబును మానసంబున నేమరక ప్రార్థింతును. నారాయణా! శృతిస్మృతి చతుర్వేద పారాయణా!

సీ. కల్పనచే, రత్న ఖచితసింహాసన
పీఠంబునాత్మఁ గల్పించువాఁడ
నాపీఠమున శ్యామలాకార! నినుఁబ్రతి
ష్ఠించి నిండార సేవించువాఁడ
సేవించి మణిమయాంచితపాత్రమున, పాద
కమలంబులతిభక్తిఁ గడుగువాఁడ

లలిమించు మల్లె మొల్లలు జాజిపూవుల
చేతఁ బాదముల పూజించువాఁడ

తచ్చరణములఁ గన్నుల దాల్చువాఁడ
భక్తితో నీపయిన పాటబాడువాఁడ
మించుప్రేమను నిను గౌఁగిలించువాఁడ
నెల్ల జగములకును ఱేడ. నల్లవాఁడ.

ఓ పరమపురుష! అయోనిసంభవ! నీకోమలాకారముచే నాకు కన్నుల పండువచేయుము. భక్తజనవిలోలా! గానలోలా!

సీ. అతిదికశ్యపులు దేవా! నిన్ను గనుటకే
జపముల నేనాఁడు సలిపినారొ
దశరథ కోసలాత్మజలు నిన్గనుట కూ
హించి యేతపము గావించినారొ
దేవకియును, వసుదేవుఁడు నీవు, నం
దనుఁడౌట కేమేమొనర్చినారొ
మున్నుల జమదగ్ని నిన్ను పుత్రునిగాఁగ
గనుట కేనదులందు మునిఁగినాఁడొ
చేయరాని తపంబులు చేసినాఁడ
మునుగరాని నదంబుల మునిఁగినాఁడ
కరుణ వెదజల్లు శాంత విగ్రహముతోడ
నాకుఁ గన్పడవేల గోపాలబాల.

(ధ్యానించుచుండగా శ్రీమహావిష్ణువు గరుడవాహనమున ప్రత్యక్షమగును.]

అత్రి— (అను ౫౫)

విష్ణు—అత్రిమహర్షీ! నీభక్తికానందించితిని- నీకు నేనుపుత్రుండుగా జన్మించి నీకోర్కెదీర్చెదను. నీ వింకచనుము.

అత్రి—ఆహా! ధన్యోస్మి- ధన్యోస్మి. (అను ౫౮)

(శ్రీ మహావిష్ణు వదృశ్యమగుచున్నాఁడు.)

పం చ మాం క ము.

స మా ప్తం.

విశ్రాంతికాలము 10 నిమిషములు.

( విశ్రాంతి సంకేతమగు తెర వ్రాలును. )

---

# సతీ అనసూయ

షష్ఠాంకమ్.

దృశ్యము ౧.

వైకుంఠము:-[ప్రవేశము. లక్ష్మి; సర, పార్వ]

పార్వ—చెలీ! ఈపరాభవముం దీర్చుకొనుట మనవలన గాకున్నను మన పతులచే నయినను నిది గావింపవలయును.

లక్ష్మి—అవును. నీవు చక్కగా నాలోచించితివి. మన మిప్పు డూరకుంటిమేని లక్ష్మి పార్వతీ సరస్వతులు నోరులేనివారనియు, నసమర్థులమనియు, జనంబులు తలంతురు. మనపై లోకంబునకుగల గౌరవంబు సయితము నశించును. నేను నాపతిని ప్రార్థించి యనసూయాపరాభవమునకు పంపెదను! మీరును మీపతులను బంపకతీరదు.

పార్వ—దీనికి నేను సంసిద్ధనయియున్నాను.

సర—నేనును మీ యాలోచన ననుసరింతును.

లక్ష్మి—చెలులారా? మరియు నిందొక విశేషముగలదు. మన మింతకుమున్ను పొందిన యవమానమును మనపతులు వినియుందురు. వారు దీనిని సాకుగా కొని మనలంగలకాలము పరిహసింతురు. ఇప్పుడు వీరిని మనము ప్రోత్సహించి పంపితిమేని వారనసూయను భంగపరచిరా మన పరాభవాగ్ని చల్లారును. కాక వారే పరిభవమందివచ్చిరా మనలను పరిహసించువారుండరు.

పార్వ—ఇది చక్రిని యాలోచన.

(తెరలో)

అమ్మా! జగన్నాథులు వచ్చియున్నారు.

లక్ష్మి—చెలులారా! నానాథుఁడు వచ్చియున్నాఁడు. మీరు మీమీపనులపైఁబొండు. ఎట్లయినను నేఁడే మీపతులను ప్రోత్సాహపరచి యిటకుఁ గొనిరండు.

పార్వ—అట్లే చేయుదుము.

(ఇద్దఱును ప్రస్థానము)

(శ్రీమహావిష్ణువు ప్రవేశము.)

లక్ష్మి—ప్రాణేశ్వరా! జయము. జయము.

విష్ణు—దేవీ! శుభమగుఁగాక. నేడు నీవదనపంకజము పంకిలమగుటఁ గారణమేమి ?

లక్ష్మి—నావదనవిషయమునకేమిగాని నేఁడు మీకింత యాలస్యమయినదేమి ?

విష్ణు:—దేవీ ! నేఁడు భూలోకమున నత్రియను నొక మహర్షి పుత్రసంతతి గోరి నన్నుఁ గూర్చి తపంబాచరించుచుండఁగా నేనే యాతని గర్భమున జనింతునని వరమిచ్చి వచ్చితిని. ఇదే యాలస్యమునకుఁ గారణము.

లక్ష్మి:—అత్రియనఁగా అనసూయాపతియేనా ?

విష్ణు:—అవును. ఆ మహాపతివ్రత భర్తయే. దేవీ! ఆ యనసూయ పతివ్రతలలో మిన్నయట సుమా !

లక్ష్మి:—మీరు మెచ్చుకొంటిరిగదా. చాలు మీసతికి లోకమందెంతటి దుష్కీర్తియున్నను మీరు భరింతురు. ఎవరిటివారిం బొగడుట మీ దుస్స్వభావము. ఆ యనసూయ పతివ్రతలలో మిన్నయఁట గాదా యని పొగడుటవలన నేను కానని యే కాదా మీయభిప్రాయము ?

విష్ణు—సతీమణీ! నీవు పతివ్రితవుకావని యన్నవారెవ్వరు? ఆ యనసూయను సాధ్వియనిన నీకు రోషమెందులకు ? నీవింత యీర్ష్యా స్వభావవని యెఱుంగనైతినిసుమా !

లక్ష్మి—వేరుగా నీవు పతివ్రితవుగావని బొట్టుకాటుకలు పెట్టి వక్కాణింపవలయునా? రాజుగారి పెద్దభార్య పతివ్రితయనినమాట కర్థమేమి? అవునవును. నేను దుస్స్వభావను ; యీర్ష్యాస్వభావను, తమకు సతిగా నుండదగను. చాలుచాలు నేటికి మీయనురాగము బాగుగ దెలిసినది.

విష్ణు—ప్రాణేశ్వరీ! నేనేమంటినని నీకీయ కారణాగ్రహము.

లక్ష్మి—చాలుచాలులెండి తెలిసె మీగడుసుతనము.

(అనుబంధము ౫౫)

విష్ణు—దేవీ! అలుకవహింపకుము. నిన్ను నేనేమియు ననలేదు. మదనచాపసదృశంబులగు నీకనుబొమ్మలను ముడువకుము. నీ వేదికోరుదు వదియెల్ల దీర్చెదను రమ్ము.

లక్ష్మి—అక్కరలేదు. తిరిగి యీర్ష్యాపరవశనని దెప్పుదురు గాబోలును.

విష్ణు—ప్రాణేశ్వరీ! నానేరము మన్నింపుము. నేను నీయెడల నెన్నడైన విపరీతభంగి వర్తించితినే?

లక్ష్మి—అట్లయిన నాయనసూయ నేదోవిధముగపరిభవించుట యే నాకోరిక. మీరీకార్యము నొనరింపవలెను.

విష్ణు—సఖీ! దుస్సహమయిన యిట్టికోరిక తగునా ? ఆసాధ్వి యలుకదాల్చి శపించిన మనగతియేమి కావలయును? ఐనను నీకీకార్యమువలన నేమిలాభమున్నది ?

లక్ష్మి—అందులకే మీరీయనక్కరలేదు. నేనడుగనక్కరలేదని వచించితిని. ఊరక నోటికి వచ్చినన్నివాగ్దత్తము లొనరించినంతనే సరిగాదు. బుద్ధిగలవాఁడు దానిని నెరవేర్పవలయును. నాలుకయున్నందులకు ఫలమప్పుడుగదా కలుగును. ఐనను అసమర్థుఁడగుపతి నేదేనివాంఛించుటకన్న జ్ఞానహీనతగలదా? జగన్నాథుఁడని పెద్దపేరట. ఒకభూలోకాంగనకు గడగడ వడంకెనట. ఇంతకన్న లజ్జాకరముగలదా? మగవారిస్వభావ మెంతనింద్యమయినది !

విష్ణు—హృదయేశ్వరీ! నిలువుము. నీకోరిక నెట్లో తీర్చెదను.

(తెరలో)

దేవా! మహేశ్వర కమలసంభవులు శర్వాణివాణులతో దయచేసి యనుజ్ఞ వేడుచున్నారు:—

విష్ణు—వారిని సత్వరముగా ప్రవేశపెట్టుము.

(శంకరుఁడు, పార్వతి, బ్రహ్మ, సరస్వతి.)

శంక—శ్రీమహావిష్ణున కభివందనము.

బ్రహ్మ—జనకా! వందనములు.

విష్ణు—మీరు నిరంతరము నభ్యుదయ మగుగాక. మీసతులతోడ నీయాసనముల నుపవిష్టులుగండు.

(అందరును కూర్చుందురు.)

విష్ణు—మహేశ్వరా! పితామహా! మీకుంగుశలమా? మీరాకకు గారణమేమి !

బ్రహ్మ—జనకా! మాకుశలమున గొంతలేదుగాని మారాకకు గారణముమాత్ర మొకింత ోద్యమయినది,

శంక— గీ. భువనవితతియెల్లపూజించి మనలదే
వాధిదేవులంచు బలుకుచుండ

నాడువారికతన నాగౌరవము మొద
లంట నణగెనయ్యా యమలచరిత.

విష్ణు—మీరును ననసూయా పరాభవార్థము మీసతులచే బలవంతపరుపబడితిరా యేమి?

బ్రహ్మ—ఆహా! అంతకన్నను మనకిప్పు డుద్యోగమేమున్నది?

గీ. అఖలకర్తలయిన హరిహరబ్రహ్మలు
పూవుబోండ్లకీలుబొమ్మలగుచు
బరమసాధ్వినొకతె, బరిభవంబొనరింప
జనగవలసె విధివశంబుచేత.

విష్ణు—ఆహా! మనమే యిట్టిదుష్కార్యంబుల నొనరించిన లోకంబులు పాపాకరంబులై నశించిపోవే? ఆడువారల కెదురాడలేక హరిహరబ్రహ్మలిట్టి దుష్కార్యమునకు గడంగిరని పలుకు వినిన లజ్జాకారణముగాదే! పరమపతివ్రతలను, సత్యసంధులను, సన్మార్గవర్తులను, ధర్మాచరణులను రక్షింపని మన జగద్భరణమేటికి? లోకపాలకత్వమేటికి? కాల్పనా? మనగౌరవమును చేజేతుల మనమే నాశనముచేసికొనుటకు సంసిద్ధులమగుచున్నప్పుడు లోకంబు లేరీతి నిలచు! సృష్టిస్థితిలయంబు లెట్లు జరుగు? సమవర్తి మనలనుసయితము శాసించిన దప్పేమున్నది? ప్రాకృతులతో సమానులమయినమనలం గాంచి జనులందరును హసింపరే? నీచాతినీచంబగు నిట్టికార్యములను నేనొనరింపలేను. కాలకంధరా! పంకజాసనా! మీయభిప్రాయములేమి?

బ్రహ్మ... మేముమాత్రమిట్టిదుష్కార్యముల కోర్తుమే? నారాయణా! ఈకథావిధానమును నిర్ణయింపజాలకయే యింతదూరము వచ్చితిమి. నీయిష్టమెట్లో యట్లుగావించువాడను.

శంక:—ఇది నాకు సమ్మతమే.

పా-ల-స:-(అనుబంధము 9౯.)

లక్ష్మి:—సరస్వతీ! గౌరీ! మనకాలిగోటికైన సరిరాని యొకమనుష్యాంగనచే నవమానింపఁబడి కలహప్రియుఁడగునారదునిచే పరిహాసింపబడుటేగాక సర్వసమర్థులయిన ప్రాణేశులగలిగియు వారిచే సయితమొకకోర్కె-దీర్పబడక నిరాకరింపబడినమనము బ్రతికినఫలమేమి? ఛీ! ఛీ! ఈనీచపుబ్రతుకుకన్న చావు మేలుగదా! నేను మాతండ్రియగు సముద్రునిఁ బ్రార్థించి యుండే జీవములనువదలెదను. నన్నిఁక మరచి పొండు.

(పోఁబోవును.)

విష్ణు—(పట్టుకొని) చిలుకలకొలికీ! కలికీ! నీకు నాపైనింత యలుకా? రమ్ము. నీకోర్కెను దీర్చెదను. ఇంతలో నింతటిసాహసమేల? శంకరచతుర్ముఖులారా! మనకార్య మిప్పు డిటుబోయిన నూయియు నటుబోవ గోయియుగా నున్నది: కావున కర్తవ్యమేమో యెఱిగింపుఁడు.

బ్రహ్మ—నాకేమియుఁ దోఁచుటలేదు. బుద్ధిశాలియగు శంకరుఁడే వచింపవలయును.

శంక—గీ. చూచివత్తమురం డనసూయనిపుడె
యానెలతకెందు నెప్పుడు హానిరాదు
సాక్షిగా దన్మహిమను బరీక్షజేసి
వరములొసగుద మాచంద్రసురుచిరముగ.

విష్ణు—అట్లేకావింతము. ఇందువలన నామెమహిమయే బయల్పడును. సతీమణీ! మేమింక నేగివత్తుము. మీ కోరికప్రకారమాసతిం బరీక్షింతుము.

లక్ష్మి—ప్రాణేశ్వరా! మీకు జయమగుగాక.

పార్వ—ఆర్యా! మీకు శుభమగుగాక.

సర—నాథా! మీ కపజయము కల్గకుండుగాక.

(బ్రహ్మ, విష్ణు, శంకరులు ప్రస్థానము.)

లక్ష్మి—చెలులారా! ఈమారు నారదుని పొగరణగగలదు. అనసూయశీలమేదోలోకమునకు దెలియును. మనము పోవుదమురండు

(ప్రస్థానము)

దృశ్యము ౨

(బ్రహ్మ, విష్ణు, శంకరులు మునివేషముతో ప్ర.)

విష్ణు—శంకర పద్మాసనులారా! ఇప్పుడు మన యాకృతులు చక్కగానున్నవి! మనలనిప్పుడెవ్వరును గుర్తింపలేరు. కాని యాసాధ్వీపేరు తల పెట్టుటతోడనే శరీరము కంపించుచున్నది.

బ్రహ్మ—ఇట్టి నీచకార్యమునందెప్పుడు ప్రవృత్తుల మైతిమో యప్పుడే సంశయములన్నియు వదలినవి.

నార—ప్ర॥ ఓహో! మురహరభవహర పద్మసంభూతులారా! నమస్కారము. ఎక్కడికీ ప్రయాణము? ఏమి యీ విచిత్రవేషము!

విష్ణు—శంకరా! ఈనారదుడు మనల నింతశీఘ్రముగ గుర్తించెనేమి?

నార—అయ్యా! నేను మీవేషములనేకాదు. హృదయములను సయితము గుర్తించితిని. పత్నీప్రబోధంబున ననసూయాపరాధవ మొనరింపఁ బోవుచున్నారుగదా!

విష్ణు—నారదా! నిక్కముపచించితివి ఐనను మేము విధిలేక చనుచుంటిమని నీవెఱుంగవా?

నార——అయ్యా! త్రిమూర్తులకు నేను తెలియఁజేయునంతటి సమర్థుఁడనుగాను. అయినను, నాకీకార్యమేమో దూష్యమనితోఁచు చున్నది.

(అను గీత)

విష్ణు——నారదా! మేమును దీనిని దూష్యమనియెఱుంగుదుము ఐనను పోకతప్పదు. ఇందువలన ననసూయ కేలోపమునుఁగలుగదు. ఆమెసాధ్వీత్వమునకు జగద్విఖ్యాంతము చేయుటకే నేనుసంకల్పించుకొంటిని. దీనిని నీమనస్సునందుంచుకొనుము. మాకు వేళయయ్యె-పోయె వచ్చెదము. (ముగ్గురు ప్రస్థా)

నార——ఆయనసూయచే వీరు తప్పకపరాభవమునొందుదురు. ఈవృత్తాంతమును పూర్ణముగ నెఱింగి వీరిసతుల కదిదెల్పి, గట్టిగ బుద్ధిచెప్పవలెను. (అను గీత) (ప్రస్థానము.)

దృ శ్య ము 3.

అత్రియాశ్రమము.

అన——(తనలో)

సీ. చేరెనో లేదొ నాజీవితేశ్వరుడల్ల
బదరికావనము సత్పథమునందు
జపమునిర్విఘ్నమై సాగినదొ లేదొ
మహితపంచాగ్నుల మధ్యమందు
అంబుజాక్షునకు దర్శనంబిచ్చెనో లేదో!
తడయకానంద చిత్తంబుతోడ
నస్మదీయ మనోగతానుసారంబయి
యాడేరెనో లేదొ యాప్సితంబు
గీ. అకట! యేభావమునుదోపదయ్యె మదిని
చింతలీడేర్చి యాభగవంతుడిపుడు

హారమో హారుడో కాకా యంబుజాసనుండో
యగుచు నర్చన మొసగ లేదమ్మ యస కట.

[బ్రహ్మ, విష్ణు మహేశ్వరులు ప్రవేశము]

భవతి భిక్షాం దేహి, భవతి భిక్షాం దేహి, భవతి భిక్షాం దేహి.

అన—త్రిమూర్తుల వంటి దివ్యస్వరూపములతోడ సాక్షాత్కరించిన యీ మహాత్ములు భవతిభిక్షాందేహి యని సన్నర్థించినారు! ఆహా! నాభాగ్యమే భాగ్యము గదా! మహాత్ములారా! ఇందాసీనులు గండు! తమ కిప్పుడు ఫలహారములర్పించెదను.

[ప్రస్థానము.]

విష్ణు—శంకర, బ్రహ్మలారా! ఈ సాధ్వింజూడగనే నామనంబు కలతపడుచున్నది. అయినను మనంబు నట్లో స్థిరము గావించుకొంటిని. మన మాలోచించిన విధము గాదక నీపడతిని వేరువిధముగా బరాభవము చేయఁజాలము. నామార్గమునే మీరనుసరింపుడు.

అన—(ప్రవేశము) (అను ర్గ)

(వడ్డించి ఔపోసనము పోయఁబోవుచున్నది.)

విష్ణు—సుదతీ! తాళుము తాళుము ! మాకొకక వ్రతము గలదు. ఆవ్రతము తీరక భుజింపఁజాలము.

శంక—

గీ. బాలరో! పలువిషయంబు లేల? వినుము!
విగతవస్త్రవై యొసగుదు వేని, నీదు
సత్కృతులనందువారము చాలవేని
మరలిపోవుదు మమ్మ! పద్మాయతాక్షి.

బ్రహ్మ—ఇదియే మావ్రతము! దీనికన్యథాగా వించిన నీసత్కృతులు మాకనవసరము!

అన—హరిహరీ! సదయాత్ములారా! మీకీకోరిక చెల్లునా! మానవతుల మానంబుగాపాడు కృపానిరతులకు విగతవసనయగునంగనచేతి యాహారంబు భుజించుటేటి వ్రతము! ఇది మీకు తగునా! నేను మీ కుమారినిగానా? పరవనితామానభంగకరములగు కార్యంబులను జడదారులే కావింపఁదలఁచిన నింకేమున్నది!

విష్ణు—ఓమానినీ! నీపలుమాటలతో మాకు నిమిత్తములేదు. కావించెదవా యట్లు గావింపుము. లేదా కావింపలేనని వచింపుము. వేరొక యింటికేగెదము. మేము రెండుమాటలవారముకాము.

అన—(తనలో) ఇది పరమేశ్వరుని మాయగాని వేరుగాదు. కానిమ్ము. నేను పతిచింతనముదక్క నన్యమెఱుంగనేని నాకేపరాభవమురాదు. (ప్రకాశముగా) ఓపవిత్రములారా! మీరింతటి దారుణకార్యంబున కుపక్రమింపగా నేనేలవెనుకదీతును, సర్వంబునకు నాపరాత్పరుఁడే కలఁడు. మీరిందాసీనులుగండు. నేనిప్పుడే మీకాహారదానముచేసెదను.

త్రిమూ—(ఆసీనులగుచున్నారు.)

ఓపరాత్పరా ! నేను మహాపతివ్రతనయితినేని యీమునీం

ద్రులు పసిబాలురగుదురుగాక!

[నీరుచల్లగా త్రిమూర్తులు పసిబాలురగుదురు. అనసూయ విగతవస్త్రయయి వారికి పాలిచ్చుచున్నది.]

(తెరవ్రాలును)

---

## దృశ్యము రవైకుంఠము.



(నారదుఁడు ప్రవేశము)

నార—[స్వగత]

ఆహాహా! నేడుగదా నాకానందము! బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు పసిపాపలయి యనసూయ పొత్తిళ్ళలోనుండుట నాశక్తివల్లగాదే! భళిరా! నారదా! భళిరా! చమత్కారమన్న నీదేచమత్కారము!

(లక్ష్మి, పార్వతి, సరస్వతి ప్రవేశము)

లక్ష్మి—నారదా! ఇప్పుడు మీయనసూయగతి యెట్లుకాగలదో యెఱుఁగుదువా!

నార—అమ్మా! అనసూయగతి నెఱుంగనుగాని మీపతుల దుర్గతి నెఱుంగుదును.

లక్ష్మి—నారదా! మావతులదుర్గతియనుచున్నావేమి? ఏమి జరిగినది! ఏమిజరిగినది!

నార—అమ్మా! సావకాశముగ

ఆ, తపపివేసములను ధరియించి
జేరినరిగి-వికతచేలవగుచు
భిక్షనిమ్మటన్న; పేరలక-
పతుల శిశులఁజేసి పాలా

(అను

లక్ష్మి—నారదా! నిజమే
లో పిల్లలయియున్నారా!

పార్వ—నారదా! నిక్క
దుర్గతి గలిగినదా!

సర—విధితనయా! వ

నార—అమ్మా! వా

వివాహమాడుడు. తప్పేమి! చిన్నమగలతో సౌఖ్యము కొన్నినాళ్ళు తెలియును.

లక్ష్మి—నారదా! పిల్లికి చెలగాటము నెలుకకు ప్రాణసంకటమనునట్లు చేయుచున్నావు.

త్రిదేవులు— (అను ౬౧)

నార—అమ్మా! నాపలుకులు మీకప్పుడెంతో విషప్రాయములయినవిగదా! ఇప్పుడు విచారించిన లాభమేమున్నది! నేనుచెప్పిన ననసూయ కినన్! అయినను చెప్పుటకు నేనెవ్వఁడను? భార్యలు మీరు; భర్తలు వారు. ఇఁక మీకిప్పుడనసూయ క్రొత్తగా నత్తగారయిందిగదా! ప్రార్థించినమాత్రమున తప్పేమి?

లక్ష్మి—నారదా! ఇన్నిదినములనుండియు ననసూయను సాధించు మహోద్యోగమునందుండి నేడామె పాదములపై బడవలసివచ్చినదా?

పార్వ—ఒక మానవాంగనకోషిన దేవాలక దానిని ప్రార్థింపుమని చెప్పుచున్నావా నారదా! మేమిప్పుడు నీకంటికెంతనీచమయితిమి?

సర—ఈనారదుండే యీనాటకమునంతను నాడించుచున్నాఁడని తోఁచుచున్నది.

నార—అమ్మా! నాకెందులకీనిష్ఠురములు. నేనునాదారింబోవుదును. ఎఱిగినవాడనుగనక చెప్పితిని. మీకీవార్త నెఱింగింపనేల? నేనే దీనినొనర్చితినని మీరనుమాటల బడనేల? [పోఁబోవును.]

లక్ష్మి—నారదా! నారదా.

నార—అమ్మా! ఏమిసెలవు?

లక్ష్మి—మాకేమార్గముం జెప్పి పోరాదవు?

నార—అమ్మా! వెనుక నేను చెప్పినమాటలను వేసిని వింటిరని తిరిగి సిగ్గులేక నేనిప్పుడు మీకు చెప్పగలను?

లక్ష్మి—నారదా! మాబుద్ధిహీనతను మన్నింపుము. తెలియక వినమయితిమి.

శ్రీ

నార—అయ్యయ్యో! నాకంత యపచారమెందులకమ్మా! మీరు జగన్మాతలు. అనసూయ మీకాలిగోటికయినా సరిరాదుగదా

లక్ష్మి—నారదా! తిరిగి మమ్మిప్పుడు వెనుకటిమాటలతో చెప్పిన నేమిలాభమన్నది? అనసూయయే గెలిచినది. మేమోడితిమి. ఇంకనయిన మాకాలోచన చెప్పుము.

నార—వహ్వా! వహ్వా! మీనోట నెన్నినాళ్ళకామాట వింటినమ్మా! అమ్మా! పార్వతీతల్లీ! సరస్వతీ-లక్ష్మియేకాని మీ రనసూయ కోడిపోలేదా యేమి? ఊరకున్నారు.

పార్వ—నారదా! అనసూయయే గెలిచినది. మేమేయోడితిమి.

సర—నారదా! అనసూయయే గెలిచినది. మేమేయోడితిమి.

నార—అమ్మా! మీరుచేయదగిన కార్యము నిప్పుడు వినుఁడు.

గీ. మున్నొనర్చిన యపరాధములు క్షమించి
కరుణగనుమంచు ననసూయ కాళ్ళఁబడుచు
ప్రీతి పతిభిక్షనిమ్మని వేడుకొనుటె
యిమ్మహిని మీకుఁ గర్తవ్యమమ్మ యిపుడు.

(అను ౘ౦)

త్రిదే—అట్లేచేయుదుము. (అందరు ప్రస్థా)

---

దృశ్యము—౫



అత్రి ఆశ్రమము.

అత్రి—ప్రాణేశ్వరీ! నీవుచెప్పినచిత్రకథ నిజమగునే? నేనుతపంబునకేగి వరమునంది వచ్చులోపల నిన్నిపరీక్షలు జరుగుటయు త్రిమూర్తులు మనయింట పసిపాపలగుటయు సంభవించెనా?

అన—నాథా! యీయద్భుతము నాకేవింత గొల్పుచున్నది.

అత్రి—ఓహో! భగవచ్చిత్రము.

ఆ. వరముగాంచి నేను వచ్చుటకుమున్నె
సుదతి సుతులగాంచె చోద్యముగను
పరమచిత్రమైన భగవత్ప్రసాదంబు
నెన్నిగతులనైన నెన్నతరమె?

[తెరలో]

దేవీ—భిక్షము—భిక్షము!

అత్రి—ప్రాణేశ్వరీ! మరియొకచిత్రమే దోజరుగబోవుచున్నదని తలంచెద ఎవ్వరో! భిక్షము భిక్షమని వచ్చినారు. స్త్రీకంఠస్వరముల వలెనున్నవి.

(లక్ష్మి—పార్వతి—సరస్వతి—ప్ర]

త్రిదే—(అను ౬౩]

పతిభిక్ష! పతిభిక్ష! పతిభిక్ష!

[కాళ్ళపై బడుదురు]

అన—అమ్మా! మీరెవ్వరు?

లక్ష్మి—మహాసతీ! అనసూయా! మాయపరాధశతములను క్షమింపుము. నేనులక్ష్మిని శ్రీమహావిష్ణుపుసతిని. ఈమె పార్వతి, శంభుని భార్య, ఈమెసరస్వతి చతురాననుని ధర్మపత్ని నిన్నుపరీక్షించుటకై పంతముబూని మేము జేసినదోషమున కిప్పుడు ఫలముగా నీ పాదముల పైఁబడితిమి! నీవే గెలిచితివి!

[నారదుఁడు ప్రవేశము]

ఆహా! కన్నులపండువయ్యె! కన్నులపండువయ్యె!

అన—లోకమాతలారా! మీకు వందనములు. నారదమునీంద్రా! నీకుజోహారు. నాకిదేమో చిత్రముగానున్నది ; మీరునన్ను పరీక్షించుటేమి? ఓడుటేమి ? గెల్చుటేమి ?

అత్రి—దేవీ! నీచరిత్రము నాకేకాక—నీకేచిత్రముగా నున్నదా!

నార—అత్రిమునీంద్రా ! ఈ యనసూయా మహాదేవిదివ్య చరిత్రము త్రిజగంబులవారికిని చిత్రమయినది.

[అను ఉర]

అమ్మా! లక్ష్మీదేవీ ! నాడు నేననసూయాదేవిప్రభావము నెఱింగించితిని. జ్ఞప్తికిఁదెచ్చుకొనుఁడు. కాదు నేప్డిజ్ఞప్తికిఁదెచ్చుచున్నాను.

సీ. పాపంబులనుపట్టా వంచలుగావించి
చండాలురకును మోక్షమునొసంగు
నలుకవహించె నాయఖిలరాత్రించర
సంఘంబునెల్ల భస్మంబొనర్చు
తనసదయపతివ్రతా శక్తిచే ఘోర
సర్పమైనను పూలసరము జేయు
మృతినొందినట్టి దుర్గతునైన నక్షణములో
ఘనపుర్జీవవృతుగానొనర్చు

గీ. నెదనుమన్మథుఁడైన నచలింపఁబోక
దోషమునడంచి భయకంపితునిగజేయు
లలిఁద్రిమూర్తులనైన బాలకులఁజేయు
తరమెయనసూయ ఘనమహాత్త్వంబుదెలుప.

ఇందొక్క యక్షరమైన బీరు బోయినదా?

లక్ష్మి—నారదా! అగతానాదతవేదివగు నీవు వచించిన విషయంబులు బీలుపోవుటెట్టుల !

అన—అమ్మా! మీకేమికావలయు?

లక్ష్మీ—గీ. తల్లిరో దివ్య సాధ్వీమతల్లివైన
నీదుసత్కృప నిపుడువాంఛించినాము
మాదుపతులను దయతోడ మాకొసంగి
యసదృశంబుగ పతిభిక్షనొసగుమమ్మ.

పార్వ—గీ. మహితభువనంబులై నీమహిమచేత
నిండినిబిడీకృతంబులై యుండెనమ్మ!
యిపుడు కరుణామృతము ప్రవహింపఁజేసి
యసదృశంబగు పతిభిక్షనొసగుమమ్మ.

సర—గీ. నిగమపతులకు తల్లివై నిలచినావు
అంచితసతీత్వమునఁ బ్రకాశించినావు
కలుషములడంచి పూజ్యతగాంచినావు
యసదృశంబగు పతిభిక్షనొసగుమమ్మ.

అన—అమ్మా! మీరిట్లర్థింపవచ్చునా! లోకమున నెవ్వరయిన తమ కుమారుల బిక్షగా నిమ్మురా! మీరు మాత్రమట్టి దుస్తరమయిన కోరికనెట్లు కోరెదరు?

లక్ష్మి—నారదా! అనసూయయే గెలిచినది. మేమోడితిమి నీవయిన చెప్పి యిప్పింపుము.

నార—అమ్మా! నేనేమి చెప్పఁగలను! నేను చెప్పిన మాటలను మీరే వినరయితిరి! అనసూయ వినునా!

అత్రి—ఓహో! ఇప్పుడీతగవు యాకాశవాణియో తీర్చవలెను గాని మానవులు తీర్పలేరు.

[తెరలో ఆకాశవాణి]

ఓహో! అనసూయమహాసాధ్వీ! జగత్కర్తలగు బ్రహ్మ విష్ణు, మహేశ్వరులు లేనిచో జగంబులు నిలువవు. కావున వారికితిరిగి.

రూపములం బ్రసాదింపుము. నీకు వారి మువ్వురి యాకృతులుంగల దత్తాత్రేయుఁడను కుమారుండు కలుగును.

నార—అనసూయాసతీ! ఆకాశవాణి పలుకులనాలకించితివి గదా! ఇఁకనయిన వారిభర్తలను వారికిమ్ము.

అన—ధన్యోస్మి! ధన్యోస్మి! నారదమునీంద్రా! అట్లేయొనరించెదను. (జలంబులు పట్టి) ఓజగద్రక్షకా! నేను మహాపతివ్రత నయితినేని యీ త్రిమూర్తులకు నిజరూపంబులు గల్గునట్లనుగ్రహింపుము (నీరు చల్లగా—బాలురు త్రిమూర్తులగుచున్నారు.]

గీ. పూర్వపుణ్యమూలంబున భువనపతుల
బ్రహ్మ విష్ణు మహేశ్వర ప్రముఖవిబుధ
సంతతులనొక్కచోట గాంచంగగంటి
చాలునానందమింక నాజన్మమునకు.

విష్ణు—అత్రిమునీంద్రా! మీపూర్వపుణ్యవిశేషమున మేము నీకు పుత్రులమైతిమి దత్తాత్రేయుఁడు మాయంశల నీకుజనించి, నిన్నానందింపఁ జేయఁగలడు. ఓయనసూయా! మహాసాధ్వివగు నిన్ను గెలువఁగలవారులేరు. ఆచంద్రార్కము చిరకీర్తిమతివిగమ్ము—లక్ష్మీసరస్వతీపార్వతులారా మహాపతివ్రతం బరీక్షించిన మీపలువతనంబునకు ఫలితముఁ గంటిరిగదా! ఇక బుద్ధిగలిగిమెలంగుడు, నారదా! మేముపోవుచున్నాము—

[పోఁబోవుదురు]

నార—అయ్యా! అయ్యా! ఒక మనవి—

విష్ణు—ఏమి నారదా?

నార—మీకోరికలు తీరిపోయినవని గాబోలును, సన్నిచ్చట విడిచి యెవరివారిని వారరుగుచున్నారు.

విష్ణు—తీరనది నీకోరికయేగాని మాకోరికలు గావే!

నార—నాకోరికలేమి? పిల్లలైన మీరు నిజరూపములు వచ్చుట నా కోరిక తీరుటగా? మీసతులకు మీరు లభించుట నా కోరిక తీరుటా?

విష్ణు—సరి సరిలే! ఇక గుదిబెండపోద కదలింపకు, ఇంతకు నీకోరిక యేమి.

నార—ఆకలి యగుచున్నది—

లక్ష్మి—కలహములతో కడుపు నిండలేదు గాబోలును—

నార—(లక్ష్మినిజూచి తల పంకించి) అమ్మా దీనితోఁగాని పూర్తముగఁ దీరదు—

విష్ణు—నీయాకలిదీర్ప నేమి కావలయును?

నార—మీరేమియు దేవలదు. నేనే తెచ్చుకొంటి; వచనము మాత్రము సల్పితిరా ధన్యుఁడను. నాయాకలి దీర్చుకొందును—

విష్ణు—ఏమి తెచ్చుకొంటివి?

నార—గులకరాళ్లు...

విష్ణు—విపరీత వ్యక్తివి;

నార—అత్రిదేవుఁలు—అనసూయ తమ కాళ్ళగోటికైన సరిరాదని గర్వించినప్పుడు—

లక్ష్మి—ఇప్పుడామాటలేల?

నార—అప్పుడీ గులకరాళ్ళను సెనగలుగ వేయించిపెట్టిన భుజియింతునని వేడుకొంటిని. కాని, వీరికనుగ్రహము రాదయ్యె—నన్నొక యున్మత్తునిగ భావించి, 'మీ యనసూయనడుగుము వేయించునేమో' అని పలికిరి. కావున మీయందఱియెదుట—నేతదవశిష్టమహోత్సవ మొందీర్చుకొందును.

లక్ష్మి—[అప] భార్గవీ! చూచితివే? ఈ నారదునిదుర్గుణము—పగఁబూనిన తాఁచుబామువలె, నీతఁడు గులకరాళ్ళతో మనల నింతదూరము వెంటాడించి మరల నవమానింపఁజూచుచున్నాడు—

పార్వ—(అప) కానిమ్ము ఏమిచేయుదము? నిండుగమునిగినవానికి చలియేమి పడిది?

నార:—సతీ! అనసూయా!

గీ. జటిని; సద్మబ్రహ్మచారిఁ; గాంక్షారహితుఁడ;
కాని, బాలుఁడనౌట, నాఁకలిఁ దపింతు
నీగులకరాళ్ళు వేయించియిమ్ము, తల్లి -
విశ్వసంతర్పణంబు గావించువాఁడ-

అత్రి—ఏమిది? మా యనసూయ గులకరాళ్ళను సెనగలుగ వేయింపనున్నదా; ఇది యన్నిఁటికన్న చిత్రముగదా!

నార—అమ్మా! మీకువలయునేని యొకబాణలియు, నగ్నియు, దెచ్చియిత్తునా?

అన:—ఏది? వానినిటు చూడనిమ్ము

నార(అనసూయచేత గులకరాళ్లుంచగా మెత్తఁబడుచున్నవి.

అన—నారదా! ఇదేమి? గులకరాళ్లు గుగ్గిళ్ళవలె మెత్తనైనవి!

నార—ఆహాహా! ఏమియీసతిమహాత్మ్యము!

గీ. పాణితలమె చెలఁగు బాణలిగాఁగ సా
ధ్వీమహత్త్వ మగ్నిదీప్తిగాఁగ
గులకరాళ్లు వంచి గుగ్గిళ్లుగాఁ జేసె
నీసతి సతీత్వ మెన్నఁదరమె?

త్రిదేవులారా! నాకుక్షైత్యము పరిహసించితిరిగాదా! మీరిది వఱకు నన్నుఁగోరినట్టిదిగో యీగుగ్గిళ్ళ ననసూయాప్రసాదముగ మీ

కొసగుచున్నాను. స్వీకరింపుడు-అమ్మా! మహిషాసురాంతకీ ! మాకు మిగులనిత్తువో లేదో సుమా!

విష్ణు—నారదా! చచ్చినబురదపాములనేలఁగొట్టెదవు ?

నార—అంతమాటలక్కఱలేదు! ఈయనసూయాప్రసాదమున మీదోషలేశము లణఁగగలవు.

(అందఱకును పంచిపెట్టును) (అను ౬౫)

త్రిమూ—మీకు శుభమగుఁగాక ! మేమఱిగెదము. [ప్రస్థా]

లక్ష్మి—అనసూయాదేవీ! నీకరుణచే మాపతులుమాకు లభించిరి. నీకు శుభంబగుగాక ! మేమును మానెలవులకఱిగెదము. [పోఁబోవుదురు]

అన—భాగ్యము.

నార—అమ్మా! లక్ష్మిదేవీ! మాట-మాట-

లక్ష్మి—ఏమి నారదా !

నార—ఎవరోడినారు; ఎవరుగెల్చినారు ?. తిరిగి యొకమాఱు చెప్పుము.

లక్ష్మి—అనసూయయే గెలిచినది-మేమోడితిమి-

నార—ఇంకపోవచ్చును-ఈమాటవినవలయుననియే పిలిచితిని.

నార—(తనలో) ఈనారదుఁడు మమ్ములను బాగుగ నవమానించినాఁడు (పోఁబోవును)

నార—అమ్మా! మఱియొకమాట !

లక్ష్మి—మఱల నేమి నారదా !

నార—నావీనులకు విందుగా సుపుత్త్రిఁడు కలుగవలయునని యీయనసూయను దీవించి మఱిపొండు.

త్రిదే—సుపుత్త్రప్రాప్తిరస్తు. (అను ౬౬) (ప్రస్థా)

అత్రి—నయవిశారదా! నారదా!

సీ. దేవకాంతలకు సతియనసూయపై
తగవుఁ బెంచిన చమత్కారివీవె
అన—అనుమానపడక శోధనమందు గెలిపించి
నను ధన్యఁ జేసిన యనఘుఁడీవె
అత్రి—ఒనరఁ ద్రిమూర్తుల నొకముహూర్తంబున
గనుపింపఁ జేసిన ఘనుఁడవీవె
అన—ప్రాకృతలోక దుర్లభముగా మూఁడు మూ
ర్తులఁ జంకకిచ్చిన ప్రోడవీవె
అత్రి—కష్టములనెల్ల సహియించి యిష్టసిద్ధి
నాకుఁ గలిగించినట్టి ధన్యాత్ముఁడీవె
అన— ధర మదీయనాటక సూత్రధారివీవె
నారదా! యుపకార మనంతమయ్యె.

నార—ఇదియంతయును మీ పుణ్యంబున గలిగెను. నాఘన మేమియును లేదు. కాలాతీతమయ్యె- పోయివచ్చెద. (ప్రస్థా)

దృశ్యము—౬ అదే రంగము.

(అన॥ అత్రి॥ బాలుని డోలికలో నూపుచుందురు.)

అత్రి—కుమారా! దత్తాత్రేయా! బ్రహ్మ విష్ణు మహేశ్వరాకార ధారితమగు నీ చిదానందవిగ్రహము నొకమాఱు చూడఁదలఁతుము. దర్శన మొసంగుము.

(దత్తాత్రేయ మహాకృతి కనఁబడుచున్నది)

(ఇద్దఱు పాడుదురు.)

మంథరధర మంగళకర మంగళంబురా। మారసుందరా శ్రీరమేశ బ్రోవరా। దాసభరణ దోషహరణ దానవేశనాశా। రాజరాజేశ్వరా యోపరాత్పరా। శ్రీనివాస జగదీశ్వరా। శ్రీరమా నాయకా జగన్నాయకా॥ మం॥ (తెర వ్రాలును.)

సంపూర్ణము.

# అనుబంధము.



## ప్రార్థన.

### ౧ స్త్రీలు—సారంగ. ధృపద

ఓవీణాపాణి ఓసత్యవాణి అలఅలఅలఅల నీలవేణి। పంకజాసను రాణి పావనభద్రాణి। ఓవీణాపాణి। సదమలగుణజాలా బుధ సన్నుత గురుశీలా పతితపావనా। విధిహృదయాంచితహారణా॥ ఓ॥

### ౨ పాపములు—బ్యాగ్. చతురశ్ర

ఔర మాతో వాదమా। మేరలేని క్రూరమా। గెడపగ నడ పగ। నిక సుంతజాలమా। కరములనఖముల కనువ కితడయక నల। యక పొడుతుము విడువక నడుతుము॥ ఔ॥

### ౩ గంగ—బ్యాగ్. త్రిశ్రగతి

బుధహితా। సురవవరనుతా। కరుణా। భరణా। ధీమహితా॥బు॥ వేలుపులెచటలేరే। ఖలులనరయగరారే। పలువిధములన్ దలచెడు గతిన్। కనరే। వినరే। యరయరే॥బు॥

### ౪ గంగ—సారంగ, కురుజంపె

శ్రీనాధనుతవేద। భూనాథ కృపరాద యీనాదు దురితముల గెడపుటకు తరిగాద॥శ్రీ॥ ఇకనాకు నేదిదారి హితచరిత హతదురిత। పరిణుతోస్మి యానిచరణ। కమలముల బడితి॥లక్ష్మీనాథ॥

### ౫ ఆకాశవాణి—బ్యాగ్. త్రిశ్రగతి

శుభము శుభము గలిగెమునికసురనది వెతమానుమా। చనుము చనుము లోకమునందున నొకసతివరయగన్। ముదమునిగ।గదియగన్। పరమ పదము దరియుమా॥శు॥

౬. నారదుడు. శ్రీరాగము. తిశాల్.

శ్యామసుందర శుభాంగ శుభగా। నతమఖాంగ జగదీశ భుజగా। లలితరాగ కళలన్ వినవుగా ॥శ్యా॥ స్థిరముగా మహతీస్వన నాదము। సుఖముగా వినరా సుకుమారా। సకలలోక భరితా శుభ చరితా। లోకనేత। మోక్షదాత నిరతా ॥శ్యామ॥

౭. నారదుడు. మోహన. చతురశ్ర.

జగముల కధిపతి వీవే ॥జ॥ జగములు నగములు జంతుజాలములు నిగమములును సకలము నీవే। నరసురగరుడులు సనురులునీవే। జనపద నానా వసతిసీవే। ధరణీ। నభతారలు నీవే ॥జ॥

౮. గంగ. కాఫీ, చతురశ్ర.

పరమ నిర్మలాత్మలాగా ॥ప॥ మహాసాధ్వులగు పవిత్రలారా ఓకృపాత్మలారా ॥ప॥ పరమభయంకర పావసంతతుల బాపినన్ను బ్రోవరారే ॥ప॥ సాధ్వులందు మీసాటివారిసీ జగతినరయ కృపనెగడ చేయుడీ ! లోకపాలకులుగా। మీపతులు। నాకదేవతలుగా। పావస త్రిలోకనాయకులుగా। ధీమతులు లోకాలోకములెల్ల। మీమహిమలోన జనన మరణములు గను ॥ ప ॥

౯. త్రిదేవులు. మోహన. కురుజంపె.

లేలెమ్మ భయముడిగి, లలితాంగి శుభమగును। ఈలీల వగవగను నేలా వినుతశీలా॥లే॥ ఈఘోరభూతేశు లెవరమ్మా తెలుపుమా ఆగమానుగతశుభ। చరితయిటురాదగునె। మేతానుసీకింక। బాలా సుగుణజాల చాలులేవగచుటిక। కలతవడ। కుము మదిని ॥లే॥

౧౦ గంగ—హనుమతోడి, చతురశ్ర

దీనజనపోషణా। దేవదేవ ॥దీ॥ దీనజనపోషణా సుగుణభూషణా ఘనాపన్న ! పాలింపవు పాపంబేమొ॥దీ॥ దీనతను నీనామమె వేమరు తలవంగా నాదిక్కుజూడకే మఱచెదవా జనపోషణా। దేవదేవా॥దీ॥

౧౧ నారదుడు—కల్యాణి, ఆది.

శ్రీరమాహృదయలోలా! నీరజాన్వితవనలోలా। శుభగుణజాలా వినుతచరిత్రా విధినుతా ॥శ్రీ॥ విబుధవినుతచరణా సుమహిత సుర హిత కరుణా। భువనపాలనా। శశిదినకర శ్రితనయనా హితవినయా।రిపు భయదా। సురవినుతా। గుణభరితా నీరజనయనా। నిర్మలచరితా। నిజహితభరిత ॥ శ్రీ ॥

౧౨. బ్యాగ్, చతురశ్రి.

చనుమికన్ శుభాంగతరంగా।గంగా।ఘనానందముగఁ గనుమా॥చ॥ (మిశ్ర)పాపములచే బాధనందఁ భావ్యమాయిదినీకూ నీపాపంబుఁ చనంగా నిర్మలాత్మను బొందుమూ। భూతలంబుఁ జేరివేగఁ। సాధ్వి యాయననూయలో నిబాధలెల్లను దెల్పుమూ। నీనమస్కారంబులిడు మూ నిర్భయత్వముగాంచుమూ॥ చను॥

౧౩. త్రిదేవులు. బ్యాగ్, ఆది.

ఇదితగదు నారదా నీపలుకులు వినకరంబువిచిత్రమా। తెలిసె॥ నిది॥ కలువమానవాంగన. గుణవతిగా విచిత్రముగనీవిటుపలుకగ ॥నిది॥ మమునిటు దెగడగ దలచెదవా। యెవతునో సతిగబొగడెదవా। సరిస। తెలిసెలే కలహాగుణముగనఁ। సరసమా। విరసమా। పరుసమా॥ మునీంద్ర ॥యిది ॥

౧౪ నారదుడు. మాయామాళవగౌళ' చతురశ్ర.

భజగోవిందం భజగోవిందం గోవిందం భజ మూఢమతే ॥భ॥ భూచర జలచర ఖేచరసన్నుత బుద్ధివిశారద మోహరదా ॥భ॥ నారాయణ చి।దానందా శుభ।పారాయణ పరమానందా॥భ॥ లక్ష్మీవల్లభ కౌస్తుభభూషణ మోక్షపురీశ్వర చక్రధరా॥ భ ॥

౧౫. లేదు.

౧౬. లక్ష్మి. శంకరాభరణము. చతురశ్ర.

తెలిపెదను వినుడు।పతిన నికనే ॥తె॥ పూనిమదమడతు దాని దిగదుకుతు ॥తె॥ పరిభవమును మునభరియింపను। రయంబునఁ వల

౨౧ భృంగి-బ్యాగ్ చతురశ్ర.

ఈవిధమున నవ। మానవరూప నన్నెవడని తలచితివో। నీమదిని॥ ఈ॥ చాలును చానా । సాధులతో నా-ఈవిధిగా నాడుటతగునా- నా యెడవాబా నాశమురాదా మించిశపించెద చూడుమిదేనను ॥ఈ॥

౨౨ అనసూయ-సావేరి, చతురశ్ర

జగధీనా నాకెనకుదికూా ॥జ॥ భిక్షుకుడొకఁడు భీమరూపము న। వినుతమునవుపగ వేడెననివా మనమందున నెంచుచుంటిగా యీ। సమయమునను - ననుగావగదవే ॥జ॥

౨౩ అనసూయ—మధ్యమావతి చతురశ్ర

పలుగాకి పనులుసేయకువమా- పాపంబులనిక మానుమా తొలుత ॥ప॥ సలలితాంగులా సతులతోడ నీ । చయములొనరింపం, జనందగదు ॥ప॥ ఈవిధమగు సాధ్వీల ఘన మహాత్మ్యమెఱుగ కిట్లుమూఢత౯ సలిపితివి। ఇంకనైనదుర్బుద్ధి నెంచకుము లేలెమ్మా వడి బొమ్మా -యిఁక ॥పలు॥

౨౪ భృంగి—బ్యాగ్, చతురశ్ర

చాలునుచాలును పరిహాసము పర సతులతోడ నాకూ ఇఁక॥ ॥చాలు॥ ముమ్మందు మందమతినైతి౯ । యిపుడెంచగంటి కడునీతి౯॥ ఇంకచాలు—ఇంకచాలూ-ఇంకచాలూ ॥ఇక॥

౨౫ అనసూయ-హిం॥ తో॥ చతురశ్ర

పాపహరణా పతియే నాదైవంబని నామనమునదగ ప్రార్థింతు౯ । ఓముర హర భవహర రాధాకాంతా। వేదాంతా చిదానందా ॥పా॥ దేవా నాపైనివాత్సల్యం। బేపారంగా నిడుమాయికనీ। శ్రీపాదంబులె చింతింతు౯ । దయగనుమా। దాసజనాధీనా ॥పా॥

౨౬ అనసూయ—హి. తో. చతురశ్ర

ఈసమయమున దయగను నిగంజన ॥ఈ॥ భీతిమంతమా విధ మునఘునప। న్నగము నాపయినంబడె కడువడి ॥సీ॥ ఆర్తలోకముల

నారయుశే నీయశముగాదా వరసదదానీ। పాదపద్మములు తలచెద గొలిచెద ॥నీ॥

౨౭ అత్రి—సురట, తితాల్

మనంబలరెగద ఘనంబుగా। కమలనయన సాధ్వీత్వమహాత్మ్యము గనగగలుగుశే కనన్గనగనా ॥మ॥ మహితసుగుణ యీబాలామణినా। మగువయగుట సత్ఫలంబుగలిగె। బహుళకలుషసంతతులు నశించె! పరివిమల సతీత్వ భరంబుగన ॥నామ॥

(విశ్రాంతి)

౨౮ ఇంద్రాదులు—జంఝూటి; త్రిశ్రగతి

పరమపురుష విగతకలుష గరుడగమన కమలచరణ। వరనగధర యరిగంభీర। కృపానిలయ రిపువిదార ॥క॥

౨౯ నర్మద—హిండోల్ రాగం। చతురశ్రగతి

కరుణాలోలా కరుణజుగనుమా। పాపినేశ జాలిగొనుమా ॥క॥ పాపములుగా శమియించెగా ॥క॥ శీతలమగు నుపచార శతములన్। జేసితి శాంతము గల్గగా ॥క॥ నాయీశ్వరుడ। వేయని నిరతము। పూజలు సల్పుచునుంటిగా ॥క॥

౩౦ కాశి—బ్యాగ్, చతురశ్రి

తెలసెను తెలసెను కపటము సుదతీ। తెలయదనుచు దలచెదవేమో అలయక వేరొక యధముసొగసుగని మదమునను। విడదలచెదవా॥తె॥ కనులేలేవని కనపడిన మగల। గనుగొని కనుగిలిపెదవా। నాయెదురుగ నెవ్వడు నిలువడు గెలువడు। ముదుసలినని దలచితివో॥తె॥

నర్మ—(సాకీ) ఓమదీయ సకల చింతాపహారా। మనోహరా నీవే నాదైవంబని నామనంబునా। దయయుంచి కొలుచునను నేలజాలమేలా॥

కాశి—సరిసరి చాలునా। చదువు చదువకిక, పలికిన మరుబలి కెదవా। ఛీ అరచెదవా। హరచెదవా। కులటనగుట తెలసెనుగా ॥తె॥

30 నర్మద—సోని—చతురశ్రి

హా హృదయేశ్వరా। నన్ బాసితివా ॥హా॥ అతిసుకుమారమై యంచిత సుందరమై యమరెడుభవదీయాకృతినే। డీపధిగతించెగా॥హా॥

32 నర్మద—కామవర్ధని, ఆది

నాకేమిదోపదోజననీ। నాదుపతి యీనాడునన్ బాసిపోయె నేమార్గమునాకింక॥నా॥ జీవరక్షణ చేయుటకో అక్కై చిరతరా త్రిజెం దితినా పతివిడితి। నాపతిజీవంబులన్ర్పింపడు నాథునితోడిదె జీవయాత్రిగా నెంచుచుంటిగద ॥నాకే॥

33 కాశి—బ్యాక్, దాదరా

కడు వింతయయ్యెహా। నాస్వాంతమందునా। ఆనందమా నానందమా నీచందమెల్లహా॥ ప్రపంచమెల్లనా। కహాకనంబడెన్ -పురాకృతమా భాగ్యంబు వహావ్వా ॥కడు॥

34 మన్మ—బ్యాక్, తితుల్

నాసాసహమూ నాధైర్యంబున్। నాభుజశౌర్యంబున్।ముల్లోకంబుల కల్లోలముగా తల్లడిల్లంజేయునుగా ॥నానా॥ హరిహరులనై। నను సురులనైనను పరులనైనన్ మరమణతున్ ॥నాసా॥

35 లక్ష్మి—ప్రబోరాగం, దాదా్రి

ఓమదన సుగుణ సదన। ధరణికి కనుపడిజనుమా। పయనంబయి వసిజనుమా ఆయనసూయానుగనుమా ॥ఓమద॥ ఫాభనమును గంటిగా, పాపిణిమలిక తృణముగా నారకుల హాసించెగా॥ అమదాంధ యనసూయను పరిభవమిడవలయునుగా। తెంకుడు పనుచును! మరిమరి। తడయకుమనుచును దెలిపిన తల లు దిప్పుము ॥ఓమదన॥

౩౬. మన్మ. సరస్వతి. చతురశ్ర!

ఇపుడెచని పరీక్షించెదను నీ!నిబుల చింతనొందనేలనమ్మ ॥యి దృపదంబగు విల్లుచేతనండగ। కృపాత్మనగు నీవునన్ను బంపగ । సుజ తయగు అనసూయనుగాంచగ । నొకనిమిషము తడవుసేయకయె ॥యి ఈసంకల్పము వసంతునకు నిపుడెలుగజేసి । వాని సాయమునుగొని యానమీర చైత్రదేవతలగొని। జనని నీకు వందనములనిడి ॥యిపుడె

౩౭. నారదుడు.

మహాసాధ్వులకు తమకిది తగునా । సరి తెలసెనుగద సతిగె చెనుగద ॥మ॥ అనుపమగుణవతి। శుభవతియగునా । యతివసుగుణ మి నైన దెలియుమా ॥మహా॥ సుబుద్ధిగాంచుమా। దుర్బుద్ధిమానుమా, 7 లువతరమగునా (హేహే) గెలువ రమగునా। మలీనకార్యంబు చాలి పుమా । యిదివినుమా । సరసమసరి ॥మహా॥,

౩౮. అన. హనుమతోక్తి, తితాల్.

ఆ హా హా హా । యలరులను గనగ । నలరెనుమదినా ॥కహా ఓహో యీచాయల్ । మహీజచ్ఛాయల్ । మందమంద । పవన।పవ చయమువీచె॥ఆహా॥ సెలదేటి దారుల్ । నెలయేటిబారులున్ హా దయానంద మొసంగెగా । మది సంతోషముగల్గెగా ॥ఆ॥

౩౯. అన. పంచరాగమాలిక. జిల్లా.

పుష్పరాగ । సుగంధిత । సీతా॥పుష్ప॥అ నీరధ మన్మథా। వ హిమాం ॥పుష్ప॥ వనసంతతినిగనగా।మహిం౩౦ । బమ్యా॥పుష్ప॥

౪౦. బీర్ ఫలాస్, రూపకం.

1 కరుణాకరుండవగుచు వగచు నను డయగనుమా । నతప తా।హతదురితా । హితభరితా । సునతా । క్రూరమా ఘోగ పిక్ ఫలాశనిడకుమా ॥పుష్ప॥

౪౧ నాయిక. త్రిశ్ర.

2 శ్రీకరమగు నీ శక్తిని లోకములేలెడి దేవ। శోకము నాకిదిమే లా, శ్రీమంగళరతీ నాయక ॥పుష్ప॥

౪౨ కామవర్ధని, రూపకం.

3 పుష్పశరా । పాపహరా । మోదకరా । గుణవిధురా శ్రీలలితా । తనయా బుధసేవిత, శుభకరణహతా । కల్యాణాన్విత వైభవ కామవర్ధనా ॥ పుష్ప ॥

౪౩ శ్రీరాగము. రూపకం.

4 శేషతల్ప నందనా । మృగనా । ఫణీశ్వరస్మరా పుష్పసాయక మోదదాయక । పక్షివాహన మోహనాంగ ॥పుష్ప॥

౪౪ శ్రీరాగము. రూపకం.

5 పలుమరునిను కొలిచెదరా మృదుసుమముల నిడిచితిరా । నీపదాబ్జముల । పలుమరు । నిడితినధక శ్రీరాగము ॥పుష్ప॥

౪౫ మన్మ. జంఝూటి, చతురశ్ర.

సుదతిరో।నాతోనిటులాడదగునటే । మదనసుఖములనిడుమారయమునను । తపమును విడిచితినిక । గలియుటకు ॥సుద॥ కోపమున నిటుపలుకుట తగునటె । నాపయిని దయదలపవుగా । అధరమధురము నొసగుము లలనాలలితముగ ॥సుద॥

౪౬. అన. బ్యాగ్, తితాల్.

పాపమురా । పరవనితలజేర ॥పా॥ మదమున తెలియక మాటలాడెదవె । తలశకలములగురా క్రూరా । భీతిగొనక । విపరీతినాతోపంతంబు లిదేరా । క్రూరా తెలిపెద నెవడవో నిలునిలు॥పాపము॥

౪౭. మన్మధుడు. భాగేశ్వరి. కురుజంపె.

కాపాడుమపరాధి । గానైతి ఘనసాధ్వి । నిపదాంబుజసేవ । నముచేతనోమాత ॥కా॥ విపరీతకార్యంబు । విదితముగనొనరించి । వె

త్రినై తినినన్ను। పీక్షింపు మోజనని। బుధవినుతగుణశీలవని యెరుగకిటుల ఘన। మూఢచిత్తుడనైతి। మోహంబు విడనైతి ॥కా॥

౭౮ అను—లేదు.

౭౯ అన—పూరి ఆది.

జారులిటుల పాపకూపములబడి సమయుచుండ్రుగా ॥జా॥ సార రహితమైనభౌతికపు సంసారసుఖమునకు లోనయిమరిమరి ॥జా॥(త్రిశ్ర) అరగడియసుఖముగోరి। సురుచిర పదమునుదూరి। నరకబాధలిహమున గని। ఛీ యని జీవమురోసెదు ॥జా॥

౮౦ మన్మథుడు—సారంగ-చతురశ్ర

["ప్యారీసునసరధూన వలె"]

ఓహోమది ముదమందెనీ సతిగాంచగ ॥ఓ॥ బహువిధదురితపు ఫలితము తొలగెను ॥ఓ॥ కామాంధుడనై కపటాకృతినై। కలుషములను నే- నొనరించినాడక్। చాలుచాలుచాలునిక సతులదూర। దోషమా। ద్రోహమా। పాపమా। తాపమా మేరమీరి। సంచరించి। నాడు దుర్యశంబుగాంచి ।ఓ।

౮౧ మాలది—ఆనందభైరవి; చతురశ్రి

సుతులారా। సుతులారా। గతిలేని మహాపద బొందుమనుచు విధివ్రాసెక్ ॥సు॥ పురములు నడవులు దిరిగినవారము।పిడికెడునన్నంబెటదొరుకదు॥సు॥ అనయము। నశనము దేహీదేహీయని యడుగగ మనకావిధి వ్రాసెక్ ॥సు॥ పిల్లలు:—మాజననీ। ప్రియజననీ। వెతనొందితి మాకలిబాధచేత మనలేకన్॥మా॥ కడుపున। ననలము। గడలుకొనినగతి। నడలితిమమ్మా। మాయమ్మా॥ ॥మా॥ తడబడినాలుక పిడుచవడినయది। దాహమునిమ్మా। యమ్మా॥మా॥

౫౨ అత్రి—జంఝూటి, చతురశ్ర

। నగసుధర । శుభవిచార । గరుడవాహనా ॥న॥ నాతపంబు గాంచివేగవరము లొసగుమా ॥న॥ అరివిదార । హతవికార భువనపాలనా । పరమప్రీతి తోడనాకు వరములొసగుమా॥

౫౩ అత్రి—బ్యాగ్, త్రిశ్రగతి

కరుణాకర- లోకేశ్వర। సర్వేశ్వరా। హేపరాత్పరా । హేపరాత్పరా। హేపాపవిదూరా॥క॥ భుజగశయన నగధరా । భువనసంచరణ, అసుర సంహారణ, పరమపురుష । విగతకలుషవిబుధనుతా। శుభచరితా రిపుహతా మునిహితా ॥క॥

౫౪ అత్రి—జంఝూటి, చతురశ్ర

మోదమందెమదిని- పూర్వసుకృతము తోలంగె ॥మో॥ పరమ పురుషునిగనగా-సుకృతంబొదవెనుగాకదు॥మో॥ వరనందన వరలాభము- బడయవగిన భవ్యవరము బడసితిని- కడురయమున - తాపమెల్ల సమసెనునా - కేలోపంబుల్ గలుగదు ॥మో॥

—విశ్రాంతి—

౫౫ లక్ష్మి—బ్యాగ్, త్రిశ్రగతి

తెలసె। తెలసె- గడుసుదనము— త్రిజగదధిపతీ కుమతి ॥తె॥ నెలతలనిన మగల మదులనలచు దనముగా ॥తె॥ [షేర్] ఓసమస్తనారీ హృదయ చోరా- లీలావతార నిర్వికారా [మిశ్ర] వాదమా-యిది భేదమా- సతి వగవుగనెదవా- కుమతి॥ తెల॥

౫౬ త్రిదేవులు—బ్యాగ్, త్రిశ్రగతి (హాదిరచాపుంగివలె)

చాలునిక సంతసంబు గల్గెనాగుగా ॥చా॥ సతులనిటుల బలుకగ। పరసమనుచు దలచితిరొకో। హితమునలుపు॥ హితముదెలుప। న హితము హితమా। పరిభవమును। బడసినమము। గనినగపుట సంతసమా। సాహసమా। తామసమా। రాజసమాధీమసమా। పలుమరు మాతో పంతముగాచాలును తెలసె। చాలును తెలసె। నాహా ॥చా॥

౬౭ నారదుడు—బ్యాగ్ చతురశ్ర.

అనసూయా తోడా । నిటువాదులాడా। నఘమానువినుడీ। చనుడీఅఅఅఅఅ ॥అన॥ (త్రిశ్ర)చాలును చాలును సాధ్వులతోపరిహాసంబుగావింపగా చాలద్రోహమని స్వాంతములందున దలపోయుచుంటిరిగా అఅఅఅఅ ॥అన॥

౬౮ నారదుడు—నాయకి, ఆటతాళం

గోవిందా చిదానందా పతితపావన। అఅఅఅఅఅ ॥గో॥ దేవాధిపవినుత చరణా దైత్యసంహరణా ॥గో॥ భక్తపాలన । ముక్తిలోలన శక్తిచాలన గుణాధనా ॥గో॥

౬౯ అనసూయ—శుద్ధసావేరి, ఝురుజంపె

(గ్రంథమధ్యమున నీయనుబంధసంఖ్యలేను 69వ పుటలో అన॥ ప్రవేశమున పంక్తి వద్ద చదువుకొనవలెను,)

దయసేయగదరయ్యా। తడయకను పీఠముల ॥ద॥ తమదర్శనముచేత తనువు సఫలతగాంచె ॥ ద ॥ మూడుమూర్తులబోలె భువన నుతచరితులగు। తమరిటుల దయగనుట। పరమసుకృతముగాన। ముదితాత్ములై మీర। లరుగుటయె సురహితము। మీపదాంభోరుహం । బుల గొలుతు । దయగనుడు ॥ద॥

౭౦. నారదుడు. మధ్యమావతి. 14 అక్షర [ఆడేచౌతాల్]

తెల్పెదవినుడిక శుభచరితము హరిహరులకుగలిగిన గతినిక ॥తె॥ యప్రియముననసూయను గనుగొని భిక్షమడిగివసనము విడుమని। యడుగ శిశువులను గను నొనరించి క్షీరము నొసగెను ప్రియకరముగ ॥తె॥

౭౧. త్రిదేవులు. తితాల్.

పోపొమ్మిక నారద మునినాథా। తడయనేలా। నీవే వడిగా॥పో॥ కరుణగనుమా మనవివినుమా భూమికిబొమ్మా। వైరంబునుమా ॥పో॥ ఆయనసూయకు నోడితిమికమా యశమునుమాంగ। ల్యములనిమ్మా వేగముగజని।వినయముననుమన । విని బలుకుము వర । మడుగుము నీవే దిక్కిక శక్తిచేతనే వతు। లం బొడగాంతుమువినుమా। వెనుక పరుషము బలికితిమనఘా । కరుణగనుమా । కరుణగనుమా వేగ ॥పో॥

౬౨ నారదుడు—కాఫీ-తితాల్.

రయమున, ధరణికేగుడమ్మా ॥ర॥ రాజిత యశానాసతినిన్, గనుగొనుడు ॥ర॥ గతకృతముల మదిలో । పలనిడక కరుణదలపుమనుడీ। యికజనుడి జగదధిపతులను। పసితనయులగను సలిపిన సతిపయి । చలమేలా చనుడీ కనుడీ । యనసూయన్ ॥ర॥

౬౩ త్రిదేవులు—సింహేంద్రమధ్య. చతురశ్రగతి

ఓలతాంగి మాప్రాణేశ్వరులను । మాకొసంగుమిక శ్రేయంబా ॥ఓ॥ చాలమోసమును సలిపినవారము । సదమలగుమానసక్షమియింపుముమము ॥ఓ॥ తొలుతనారదుడు పలికినపలుకును । తెలియక పెడచెవినిడితిమిగా। కలతనొందితిమి మాహృదయంబుల కరుణతోడ పతిభిక్షమునొసగుము ॥ఓ॥

౬౪ నారదుడు—భాగేశ్వరి, చతురశ్ర

ఈ సుదతి- సుమహిత-సురహిత-యైనసచ్చరిత్రయగును వినుమాయీ॥ సాధ్వులెల్లను ననుసరింప తెరవై-సద్గుణసంపూర్ణమై-విమలమై-సర్వలోకపావనప్రముఖమై- శుభదమై - సుకృతమై - యనింద్యమగు ॥ఈ॥

౬౫. నారదుడు. మాయామాళవగౌళ త్రిశ్రగతి.

అనసూయా। ప్రసాదమూ మనకు సుప్రసాదమూ ॥అ॥ వనరుహాసంభవ హరిహరవరులకు రుచికర॥మన॥ గులకరాళ్ళు సెనగలుగా నలయక పచనంబుజేసె, సలలిత సఫలప్రదాత యశోపేతగా ॥అ॥

౬౬ త్రిదేవులు. బ్యాగ్. చతురశ్ర.

విమలని గమవినుతా మంగళమగు ॥ విశ్వజనాహ్లాదిత చరిత్రమగు ॥విమ॥ ప్రముదము గలిగెను పావనకథనము। విమలతచే జగద్వినుతిగాంచితివి - భువనపతుల పసి - బాలురజేసితి- శిలల పచనమును సలిపితివమ్మా విశ్వలోకహిత విశ్రుతచరితా ॥వి॥

సంపూర్ణము.

---



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA130B199 |
| పుస్తకం పేరు | సతీ అనసూయ |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 101 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | II |
| లేని పేజీలు | 1-106 |
| తయారు చేసినది | munsha |
| పేజీలు విడదీసినది | munsha |
| స్కాన్ చేసినది | Haseema |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |